ఓమ్.

# ఉత్తరరామచరితము

పండిత, పామర్తి సూర్యప్రకాశశర్మగారిచే

రచింపఁబడినది

---

రాజమహేంద్రవరనగరమున

బుక్ సెల్లరు

షేక్ మొహిద్దీన్




ప్రకటింపఁబడినది

---

శకము ౧౮౪౭ వైశాఖమాసము

క్రీస్తుశకము ౧౯౨౫ మే

మొదటికూర్పు 1,000


రాజమహేంద్రవరము

శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామినాయఁడుగారిచే

సరస్వతీ పవర్ ప్రెస్‌నందు

ముద్రింపఁబడియె

1925


 [వెల రు 0-12-0 లు.

# కృతిసమర్పణ

శా. శ్రీరాముం డగువిష్ణునాభిని జనిం । చెన్ బ్రహ్మయాదేవుఁ డ
ట్లో రాజజ్జగముల్ సృజింప సుతులం । బ్రోద్యత్ప్రభారాసులన్
ధీరోదాత్తుల నేడ్గురిం గనియె నా । దివ్యప్రభావాఢ్యులం
దేరాకీర్తిలె నత్రి తథ్య వచనుం । డార్యేంద్రపూజార్హుఁడై.

చ. జనకవచోనిబద్ధుఁడయి । జాయనుగాననసూయఁ బొంది యా
ఘనయశుఁ డత్రిపుత్రకులఁ । గాంచి త్రిమూర్తులవంశకర్తయై
కననుతి నర్చనావసుఁడు । త్న్మొవలయు ప్రథితాచ్ఛకీర్తియై
యనితర సాధ్యుఁడై వెలసె । నాకులమందుఁ దపోధనాఢ్యుఁడై.

శా. ఆగోత్రంబునఁబుట్టి నిర్మలవచో । హైరణ్యగర్భుండు భూ
భాగప్రోజ్జ్వలితాచ్ఛకీర్తినిధిశ్వా । వాశ్వుండు ధీరాశి క
ల్పాగప్రఖ్యుఁడు, వారిగోత్రమున ది । వ్యబ్రాహ్మణారాధకుం
డై గోముం గనుకృష్ణయాఖ్యుఁడు దితుం । డయ్యె న్మహాత్ముండునై.

శా. ఆకృష్ణాఖ్యునకున్ జనించెను గళా । యాచిష్ణుఁ డుద్దండుఁడై
సాకల్యంబుగ శాస్త్రవేత్తయయి ప్ర । జ్ఞారాశియై స్తుత్యుఁడై
మాకాంతాధవపాదభక్తుఁడయి రా । మబ్రహ్మనామసద్ద్విజుం
డేకానేక కళావిదుం గనె సుతున్ । వృద్ధార్భకుం ధీనిధిన్.

ఉ. శాస్త్రము లెన్నొ నేర్చి గుణ । సంఘములం గనువాని న్యాయవా
శ్శాస్త్రములందు నేర్పుఁగని । స్మార్తవిధానవిచక్షణుండునై
శాస్త్రియనం బ్రసిద్ధుఁడయి । సాహితి మాకు నొసంగి ప్రీతితో
శాస్త్రము లెన్నొ నేర్పుకొను । శక్తినొసంగిన సోమనాథునిన్.

ఉ. మాగురువర్యునిం దలంచి । మానసమందుఁ దదీయనామమున్
నీగురుతన్ ధరాతలిని । నిల్పెడు దాని ద్విజేంద్రతారకా
ఖేగము లట్లు నిత్యమయి । కీర్తిలు దానిని నిల్పి మత్కృతిన్
నైగమవాక్యవేది యగు । నాగురువర్యున కిత్తు నీకృతిన్.

పండిత, పామర్తి సూర్యప్రకాశశర్మ

## ఇందు వచ్చుపాత్రములు.

### పురుషులు

శ్రీరాముఁడు—అయోధ్యప్రభువు

లక్ష్మణుఁడు
భరతుఁడు } శ్రీరాముని తమ్ములు
శత్రుఘ్నుఁడు

సుమంత్రుఁడు—మంత్రి

విజయసేనుఁడు—సేనానాయకుఁడు

వాల్మీకి
వసిష్ఠుఁడు } బ్రహ్మర్షులు

జాబాలి, జైమిని, శాలంకాయనుఁడు, గౌతముఁడు—వాల్మీకి శిష్యులు

కుశుఁడు, లవుఁడు—శ్రీరాముని పుత్రులు

వీరు కాక సూత్రధారుఁడును నటియు నాకాసవచనంబుల నింద్ర వాయుయమాదులును సందర్భానుసారముగ వచ్చుచుందురు.

### స్త్రీలు

సీత—శ్రీరాముని భార్య

ఊర్మిళ—లక్ష్మణుని భార్య

మంజువాణి
కలభాషిణి } పరిచారికలు

—

శ్రీరస్తు

శ్రీ శారదాంబాయైనమః శ్రీ గణేశాయనమః శ్రీ హయగ్రీవాయనమః

"శ్రీం హ్రీం సరస్వత్యైస్వాహా"

# ఉత్తరరామచరితము

ఉ॥ శ్రీరమణీమచర్చికప్రసిద్ధచరిత్రధరాతనూజస
ద్వారమనోరథప్రదము • దంబునయోగవియోగసౌఖ్యముల్
గూరుపఁదద్రసంబులను • గొల్లగఁబొందుచుఁబుత్రకాప్తిచే
ధారణిఁగీర్తిఁగాంచుపర • దైవముమీకిడునిష్టసిద్ధులన్.

చ॥ సిరియనఁగీర్తిఁగాంచివర • శీలముఁదాలిచిధారుణీస్థలిం
బరమపవిత్రతామణి,ప్ర • భావసమేత, ప్రసిద్ధశక్తిసం
భరితకుమారబాహుబల • పాలితవాజివరేణ్యదత్తస
ద్వరయుతనాఁజెలంగుసతి • పద్మయొసంగునుమీకభీష్టముల్.

(నాంద్యంతమున)

సూత్ర:—(ప్రవేశించి) ఆహా! యేమినేఁటి దివసపరిణామము! లౌకికవ్యాపారవిశ్రాంతులగు నీమహాత్ముల హృష్టాత్ముల(జేయుటకై యొద్దియైన రూపకవిధానమునాలోచింతునుగాక. (తెరలోనికిఁజూచి) సఖీ! నటీ! యిటురమ్ము.

నటి:—(ప్రవేశించి) ఆర్యపుత్రా! జయము జయము.

సూత్ర:—ఆర్యా! నేఁడు మనపూర్వపుణ్యవశంబున నీమహానుభావులిటకు విచ్చేసి యొద్దియైన నాటకంబాడి సంతోషపఱుపుమనికోరిరి. ఎయ్యది వీరినానందపఱచుటకనువగును? ఆలోచించిచెప్పుము.

నటి:—(ఆలోచించి) ఆర్యపుత్రా! జ్ఞప్తికి వచ్చినది.

తే॥ గీ॥ గర్భవతియైన భామను • గానలందు
విడిచిపుత్రులచే నాజి • బిరుదువాయ
నోడి పిదపఁగాంతనుబొంది • యురవడించి
సౌఖ్యమందిన నృపుకత • శ్లాఘ్యమగును.

సూత్ర:—నటీ! సందేహమేమి?

ఉ॥ భామిని గర్భమందుఁగనిన ♦ భవ్యముదంబగు నామెపీడినం
జేమమువోయి వంతయగు ♦ వీరులఁబోడుట దుస్సహంబువా
రీమహిపుత్రులేయయిన ♦ నెంచఁదరంబె ప్రమోదమంతనా
కామినిసాధ్విఁబొందినను ♦ గల్గెడి తుష్టికిమేరయుండునే?

తే॥ గీ॥ ఇట్టిశృంగారకరుణల ♦ వృద్ధిఁగాంచి
వీరరసముప్రేక్షకులకుఁ ♦ బ్రీతిఁగూర్చు
నెడను సంశయమున్నదె ♦ యిందునెందు
నట్టిదృశ్యమున్నఁదెలుపు ♦ మతివ! వేగ,

నటి:—నాథా! సాకేతపురాధీశ్వరుని చరితమట్టిదె యగునుగదా?

సూత్ర:—(స్మరణమభినయించి) కాంతా! జ్ఞప్తికివచ్చినది.

సీ॥ అడవులకేగిన ♦ యదనునఁగాంతను
గోలుపోయిపిదపఁ ♦ గూడుకొనియె
నామెగర్భముఁదాల్చె ♦ నంచువినిముదంబు
నతివేలముగఁగాంచె ♦ నధిపుఁడంత
జనవిందక్రియట్టి ♦ సాధ్వినివిడనాడి
మనసుకుదురులేక ♦ మసలుచుండె
హయమేధమునవాజి ♦ నరులుకట్టుటవిని
వారలకనినోడి ♦ వంతనందె

తే॥ గీ॥ వారలుకుమారులనిమౌని ♦ వరులుతెలుప
హర్షమందిజానకితోడ ♦ నాత్మజులను
గొనియయోధ్యకేగిసుఖంబు ♦ ననుభవించి
పొందినరసంబులతిపరో ♦ ముదమునిచె.

నటి—ప్రాణేశ్వరా! అదియెప్రదర్శింతము. దానిప్రతియొకటి మనకు లభించి యున్నది.

సూత్ర—అదృశ్యము నెవరురచించినారు? ఈకథనెంతఱోవ్రాసియుందురు.

నటి—సర్వపాపహరమైన శ్రీరాముని చరిత్రమును జెక్కురు పెక్కుతెలుంగుల రచింతురు. దానికామహాత్మ్యనియందలి భక్తియేకారణము. మనకులభించిన గ్రంథమును రచించిన కవిని దెలిపెదవినుఁడు.

సీ॥ ఆత్రేయ గోత్రంబు ♦ నందునజన్మించి
పావనత్వంబునఁ ♦ బరగు నెవఁడు

కామేశదీక్షితు ♦ ఘనతనిల్పుచున ప్ర
ఖ్యై విప్రులందున ♦ వఱలు నెవఁడు
రామయజ్వకుఁబౌత్రుఁ ♦ డై మహీతలమునఁ
బక్తిపావనతచె ♦ వఱలు నెవఁడు
భద్రాఖ్యపుత్రుఁడై ♦ బహుకళావేత్తయై
భవ్యవర్తనుఁడునై ♦ ప్రబలె నెవఁడు.

తే॥ గీ॥ సుబ్బమాంబాకుమారుఁడై ♦ క్షోణి నెవఁడు
కీర్తిఁగాంచెనామహితుఁడ ♦ క్షీణసుగుణ
ఘనుఁడు పండిత, సూర్యప్ర ♦ కాశశర్మ
వ్రాసె నుత్తరరామప్ర ♦ వర్తనంబు.

సూత్ర—ఓహో! అతఁడా? అతని నిదివఱకే యెఱుఁగుదును. వానివలన,

తే॥ గీ॥ మదనసుందరీ పరిణయం ♦ బుదయమయ్యె
నంత బ్రహ్మపురాణంబు ♦ నవతరించె
నాంధ్రసాహిత్య కల్పత ♦ ర్వనునదొకటి
వీరలవకుశాఖ్యమొకఁటి ♦ వెడలెసుమ్మ.
అదియుంగాక.

ఆ॥ వె॥ గ్రంథరచనమన్నఁ ♦ గవివర్యుఁడతనికి
మంచినీటిప్రాయ ♦ మంచుఁబలుకు
చుందు రధికులట్టి ♦ యుత్కృష్టకావ్యముల్
ధరణినిల్చుఁజంద్ర ♦ తరణులట్లు.
అతఁడే గ్రంథకర్తయైనచో నయ్యది యవశ్యముగాఁ బ్రదర్శింపవలసినదె.

నటి—అటులనే కానిండు. విన్న రామాయణమునే వినవలయును. తిన్న గారెలనే తినవలయునందురు. అట్టిరామాయణ కథహృద్యంబె యగును.

సూత్ర—ఋతువర్ణనమును గావించి సభికుల కానందమును గొలుపుము.

నటి— చిత్తమట్లనే కావించెద.

చ॥ పడఁతులఁగూడిభర్తలు ప్ర ♦ భావముఁదెల్పుచుఁగౌఁగిలించుచున్
గడునను రాగమొప్పవిము ♦ ఖత్వమునందినముద్దులాడుచున్
వెడలుచువేఱుతావులకు ♦ వేడ్కఁజరింతురుపూలతోఁటలం
దడవులయందుమాధవము ♦ నందనురక్తికి మేరయుండునే.

సూత్ర:—అగునగును, మిక్కిలి యుచితముగానున్నది. నీవొనర్చిన యీవసంతవర్ణనము వినిన నాకు (ముద్దిడఁబోవుచు) నట్టికోర్కె యేపుట్టుచున్నది.

నటి;—(తప్పించుకొని) నాథా! యిది సభామండపమనుట మఱచితిరా?

సూత్ర—(ఆగి) ఔనౌను. వసంతవర్ణనమే యిట్లు ప్రమత్తులను జేయుచుండ నిఁక వసంత మెట్టి ప్రభావము కలదని చెప్పవచ్చును. (తెరలోనికిఁజూచి) ప్రియసీ! అటు చూడుము. ఎవరో దంపతులు వనవిహారము సేయుచు నిటువచ్చుచున్నారు.

(తెరలో)

ప్రియురాలా! జానకీ! యీయుపవన మెంత హాయిగనున్నది? అతి తాపంబున భూమియంతయు నిగిరిపోవుచు శీతలనామమాత్రమైన కానరాని యీకాలంబున నీవసంత ఋతువున నీతోఁటయం దెంతహాయిగనున్నది?

సూత్ర—ప్రాణేశ్వరీ! యెవరో మాట్లుడుచు నిట్లువచ్చుచున్నారు. మనమిటనుండరాదు. పోవుదము.

నటి—(చూచి) ఆర్యపుత్రా! మఱియెవరునుగారు. వసుధాభారాపనయనంబునకై యిటనవతరించిన సీతారాములే.

సూత్ర—(చూచిసంతసముతో) ఆహా! యేమదృష్టము దర్శనభాగ్యంబునఁ బావనుల మైనారము. ప్రచ్ఛన్నముగనుండి వారల సంభాషణమును విందము. రమ్ము.

నటి—అట్లనేకానిందు. (నిష్క్రమింతురు)

ఇయ్యది ప్రస్తావన





# ఉత్తరరామచరితము

## ప్రథమాంకము

### రంగము—పూలతోట

(గర్భభారాలసయగు సీతయు శ్రీరాముఁడును బ్రవేశింతురు)

సీత—ఆర్యపుత్రా!

తే. గీ. దివసమంతయుఁ బురమందు • దిరుగుచుండి
జీవనంబు జరుపుకొను • సేవకులకుఁ
గలశ్రమంబు వాపుకొనంగఁ • గమలజాతుఁ
డిట్టితోఁటల సృజియించె • నేమొ దయను.

ఉ. వత్సరమందు వచ్చెఁగను • భాగముకీర్తిలు మాధవంబయా
పత్సమయంబులుండవు వి • వాహములాదిగ శోభనంబులే
నుత్సవముల్ విరాజిలు వి • యుక్తులు తీర్థవిలోకనంబునం
దుత్సుకతన్ వహించిచను • చుందురు కల్మషముల్ నశింపఁగన్.

చ. తరువులు పుష్పసంతతులఁ • దామరసేక్షణ లచ్ఛరాగముల్
వరమతులౌ కవీశ్వరులు • భవ్యకవిత్వపటుత్వమున్ వహిం
తురు నరపాళి యంతయును • దుష్టివహించి రహించు హాయిగాఁ
దరుణసమీరుఁ డెల్లరకుఁ • దద్దముకంబితు మాధవంబునన్.

శ్రీరాముఁడు—(సీతభుజముపయిఁ జేయవైచి) సుందరీ! సందేహమా? (ముద్ద గొనుచు)

చ. ప్రియసతిసన్నిధానమున • వేడుకఁ గూర్చుచు నుండ నిష్టసం
చయములఁ గల్గి సౌఖ్యపడు • శస్త్రచరిత్రుఁడె మాధవంబునం
దియువిలు కానిపోటులకు • దెబ్బలవియోగమునందు మానవుం
డయయొనిమేషమైనఁ ధర • యందునఁ బ్రాణముఁ దాల్పనేర్చునే!

ఈవసంతప్రభావము నుతింపఁ దగి యాశ్చర్యమును గొలుపుచున్నది.

చ. మరుఁడు సుధీరుఁ డాతని కు ♦ మాధవుఁడే రిపుఁడెట్టిచిత్రమో
తరుణిరో వింటివే యతని ♦ దండధరుండు నిశాటుఁడో బలో
త్కరములు షట్పదావళులు ♦ కార్ముకమిత్రువు పూలతూఁపులో
వరనిను సంబునం గెలుచు ♦ నయ్యాజులన్న యరీతి తోఁపఁగన్.

సీత—నాథా!

ఉ. నిర్మలమైన స్థిరమువి ♦ నిర్మలమైన నభంబుఁ గల్గి రా
త్కర్మలకే ప్రశస్తమగు ♦ కాలను మాధవ మంచుఁ బల్కవా
దర్మిలి నేయెఱుంగ రన ♦ నౌనను రాగము లీదృశ లెత్తు కాలమో
శర్మదశీల! దంపతుల ♦ స్వాంతములందని యెంతు దీనినిన్.

ఈఋతువునందు నాకుఁగల యనుభవమును వినుఁడు.

ఉ. ఎప్పుడు తోఁటయందుఁ గని ♦ హృష్టమనంబు వహింతునంచు నే
నెప్పుడుఁ గోరుచుంటి ధర ♦ ణీశ్వర! నీదువియోగ మింతయే
నొప్పగు నాకు మున్న వని ♦ నొక్కతెనుంటిని వత్సరంబు హా
చెప్పఁగరానుగా వనటఁ ♦ జెందిన రీతిని లంకయందు నన్.

కావున నాయందనుగ్రహముంచి సర్వకాలము నాకుభవత్సాన్నిధ్య సంస్థితిఁ గటాక్షింపుఁడు.

శ్రీరా—దేవీ! యింత యధైర్యపడియెద వేల? మన మెటకుఁ బోవుదుము. అవశ్యక కృత్యములు తప్పునా? రాజకార్యము లెట్లు విడువనగును.

చ. పగలు సభాస్థలంబున నృ ♦ పాలనముఁ బొనరింప కెట్లు రాఁ
దగును బ్రభుత్వమందుఁ బరి ♦ తాపమె కాని సుఖంబు లేదు రా
జ్యగతుల నేర్పుమైఁ గనిన ♦ యానయ విజ్ఞత లోకభావముల్
సుగమముగా నెఱింగి మఱి ♦ శోధనఁ జేయఁదగున్ నృనేతకున్.

సీత—ప్రాణేశ్వరా! అదియుక్తమే. మీకు సభాస్థలంబున సుఖము కలదని నే ననుటలేదు. మిమ్ము విడిచియుండు నిమేషమొక్క యుగమై తోఁచుచున్నది. కావున నాయభీష్టమును దీర్పఁదలంతురేని నన్నుఁ గూడ సభకుఁ గొనిపొండు.

శ్రీరా—అదికష్టము.

చ. భువనమునందుఁ గీర్తిఁగని ♦ పొల్పగు రూపము గాంచినట్టియే
నృపవరుసతీమతల్లియును ♦ నేత్రసభాస్థలి నుండరాదు శా
త్రవులకసూయ హెచ్చునని ♦ తప్పదు దానఁ బ్రమాదవశాను జే
తృవిధను నేరెఱుంగరు ప్ర ♦ తిష్టలడంగు విచారవశాగదా.

అందునఁగాదె రాజకాంతలంతఃపురంబులందు మాత్రమే యుండవలయు నందురు. పాపైక జీవులగు నరపతులు తమ సతులితరుల కంటఁ బడుటకిచ్చగింపరు. అట్లు పెఱవారికిఁ గానిపించినచో

చ. మనము చలించు దానఁగడు ♦ మన్మథతాపము హెచ్చు సిగ్గు పో
వుచు భయమాతొలంగు వర ♦ బుద్ధియడంగు మహా ప్రయత్నముల్
పొనరుచు నామె నెట్లయినఁ ♦ బొందఁగ దానగణంబు సిద్ధమౌ
నని జయమేరికానొ ప్రళ ♦ యంబగు సేనలకున్మనోహరీ.

కావున బుద్ధిమంతులు తమసతులను బరిషన్మధ్యమునకు రానీయరు.

సీత—నాథా! పట్టాభిషేకమునందుఁజూడరా? అదిమాత్రము వ్యతిరేకమునకుఁ గార ణము కాదా?

శ్రీరా—సతీ! సత్యముఁజెప్పితివి. పట్టాభిషేక సమయంబున ధర్మస్వరూపులగు బ్రాహ్మణోత్తములు పెక్కురన్ని ప్రక్కలను వేదమంత్రంబుల నుచ్చరించుచు నుందురు. దాన దుర్మార్గులకాయంగనామణులు కానిపింపరు. ఒకవేళఁగా నిపించినను వేదవాక్కులు చెవిఁజొచ్చుకాలంబున దుష్కార్యాసక్తి యెట్టివా రికి నుదయింపదు. ఒకవేళ నుదయించినందము మఱలవానికాకాంతకానం బడమి నయ్యాను రాగము క్రమముగా నశించును. అందున నోకించుకయుఁ జేటు కలుగదు. వివాహమునందు నట్లులే యగును.

సీత—ఆపత్సమయములందు?

శ్రీరా—

ఉ. ఆపదలో తటిన్హృదయ ♦ మందముదంబు తొలంగు మోమునం
దోఁపవు మందహాసములు ♦ తోఁచు విచారపు సూచనల్ మహా
పాపులకైన నాతటినిఁ ♦ బంచశరోద్భవభావముల్ ధరన్
దోఁపవు దాననాయెడను ♦ దోషము కల్గదు దృష్టయైననున్.

అదియునుంగాక,

చ. సుదతి సువర్ణగాత్రివర ♦ సుందరదేహలతా విరాజమా
నదరసమాన కంధరక ♦ నంబడినంత దురాత్ముఁడైనవా
త్మదయఁదలంచి పొంచునెదఁ ♦ దాల్పఁడు మోహము, దోషియైనచో
నదయత నాసతీత్వమెర ♦ యంబునఁ జంపును వానిఁ గామినీ!

సీత—ఆర్యపుత్రా! పోనిండు. కొంతకాలము వఱకు లక్ష్మణునిఁ బ్రతినిధినిగా నుంపుఁడు

శ్రీరా—జానకీ! అతఁడీధరాభరణభారము వహింప సమర్థుఁడేయయ్యు సోదరులకను యవాడమునను ననుమానమున విచారించును.

సీత—పోనిండు. భరతుఁడైన వహింప వచ్చునుగాదె.

శ్రీరా—అతఁడు మొన్నటివఱకు రాజ్యభారమును వహించి విశ్రాంతి నొందుచున్న వాఁడు.

సీత—శత్రుఘ్ను కుమారుఁడు.

శ్రీరా—లక్ష్మణుఁడు తిరస్కరించిన రాజ్యము నాతఁడభిలషించునా?

సీత—అతఁడును సమ్మతింపనిచో మహామంత్రిని నియమింపుఁడు.

శ్రీరా—నారీమణీ! (ముద్దుగొనుచు) యిన్ని ప్రశ్నలెందునకు? నేను సంతతము నీ సమీపముననుండు నవకాశమునకై యేనా! తమ్ములు సమ్మతింపని రాజ్యము నాతఁడేమని స్వీకరించును? అట్లెన్నటికిని జరగదు. నీకోరికయేల తీర్పరాదు? ఇపటినుండి ప్రాతఃకాలమునందె సభాకార్యములు నిర్వహించుకొని మధ్యాహ్నమున నీయంతిపురికిఁ జను దెంతును.

సీత—అనుగ్రహింపఁబడితిని. (రామునిఁజూచుచు)

చ. పతికడనుండి ప్రీతిఁగను • భామకృతార్థతఁగాంచు సాధు స
న్నుతిఁగతి సాధ్వియై జగతిఁ • దుల్యతలేకరహించు నట్టియా
మతిమతి జీవితంబుబుధ • మాన్యమగున్ హృదయేప్సితంబు లా
లితయయివంతనీవు తగుఁ • బ్రేమనిధానమనం నా మెనున్.

శ్రీరా—మనోహరి! యిందునీయభిప్రాయము సరికాదు. రాత్రింబవళ్లు పతివిరహితయై యనంతవిచారసహితయైన సతీమణియొక్క జీవితము దుఃఖభాజనమగును. రాజకార్యములకయినఁ జనక పతి సర్వదా తనయొద్దనే యుండవలయునని గృహిణియగు నేకాంతయుఁగోరదు. అయినను నీమాటను ద్రోసివేయక సవరించుకొంటినిగదా. (ముద్దిడును)

సీత—నాథా! (గద్గదముతో) స్త్రీలకుఁబ్రసూతియొక గండమని చెప్పెదరు. మన యదృష్టమెట్లున్నదియో? దైవానుగ్రహంబున సుఖప్రసవమైనచోఁ గృతార్థురాలనే, కానిచో:—

శ్రీరా—(తొందరతో) పాపముశమించును గాక. ప్రాణేశ్వరీ! అట్టియమంగళవచనంబు లాడకుమా. దైవము మనల ననుగ్రహించును గాక,

చ. ధరణిజరో! మదీయవసు • ధాతలజీవితసత్ఫలంబు నీ
వరతను గాఢబంధనపుఁ • బ్రాప్తిని గాక మఱొండు రీతినిం
దొరకదు దానసంశయము • నూల్కొనవక్కఱలేదు కామినీ!
యరమలికల్ వహింపకుమ • హర్షము నిస్థితిమాత్రమైతగున్.

చ. అనితరసాధ్యవర్తనము ♦ నార్యనుతంబగు సత్యవాక్యముం గ
లిగినను నమ్ముమంగనరో! ♦ కీడయినన్ ధరణీతలంబునం
దునను జవిన్నమాటొక్కటెను ♦ దౌర్బల్యలి నేనుఁ బరిగ్రహింపఁ బ్రా
వునిలఁ బతివ్రతాత్వమునఁ ♦ బొందితి వచ్ఛయశంబు జానకీ!

ఉ. సీతకు రాముఁడున్ సుగుణ ♦ శీలుఁడు రామునకున్ ధరాతనూ
జాతయుఁ గల్గుటన్ భువన ♦ సంచయ సన్నుతులైరి చిత్రమౌ
భాతియశంబుఁ బ్రేమయుఁ బ్రి ♦ భావముఁ గల్గి చరింపఁ గాఁదగున్
భూతలమందు దంపతుల ♦ పోల్కకు దాహరణంబు కాఁవలెన్.

అంతియకాని నేనుమాత్రము తుచ్ఛములైనయైహిక సుఖములనపేక్షింతునా?

సీత—ప్రాణనాయకా! అట్లనకుఁడు.

ఉ. కామిని సర్వకాలమును ♦ గాంతుని సౌఖ్యమె కోరఁగావలెన్
బ్రేమము భక్తియుం గలిగి ♦ శ్రీశునిగా నిజనాథు నెంచి సే
వామహితాచ్ఛసంపదను ♦ బ్రస్తుత శీలముఁ గల్గియున్న మే
లీమహి నట్టి నాథుని య ♦ భీష్టముఁ దీర్పని కాంతయేలకో?

నాకపకృతియైనను గష్టములయినను సహింతును గాని మీకుఁ దలంపను. కావు
ననన్ను గారణముగాఁ జేసికొని మీరెన్నఁడును శ్రమపడరాదని వేడుకొనుచున్న దా
నను. (ఎడమచేతిని రాముని భుజముపయి వైచి కుడిచేతితో గడ్డమును బట్టుకొని
రాముని దెసఁ జూచును.)

శ్రీరా—(సీతను ముద్దిడి) సుందరీ! ఎన్నఁడు నట్లనకుము. ఎట్టియాపదలయినను సహిం
తునుగాని నిన్ను నిమేషమైనను విడువనేరను. అర్ధాంగము లేనివాఁ డేమి చేయఁ
గలఁడు? నాశక్తియంతయు (సీతనుజూచి) సీతాస్వరూపమే సీతలేని రాముఁడు
వ్యర్థుఁడే. ఏమియుంజేయఁజాలఁడు.

సీత—(చిఱునవ్వుతో) నాథా! నేను సమీపమున లేనియప్పుడు వాలిని రావణాదుల
నెట్లు నిర్జింపఁగలిగితిరి? సీతావిరహితులరగు మీకప్పుడు శక్తియెట్లు కలిగినది?

శ్రీరా—మహానుభావుఁడగు నగస్త్యునివలనఁ బిమ్మట వింటిని. ఆమహావిచారసమయం
బున నాకుశక్తియున్నదో లేదో తెలియనే తెలియదు. హనుమత్సుగ్రీవాదులు
ను లక్ష్మణుఁడును నాచే నామహాకార్యంబులఁ జేయించిరి.

సీత—(మందహాసముతో) అగస్త్యుని వలన నేమి వింటిరి?

శ్రీరా—సీత సర్వకాలము నీతోడనే యున్నదనియు లంకకుఁ జెఱగాఁ గొంచిపోఁబడిన
సీత భువనముల మోహింపఁజేయుచున్న మాయయే కాని యొండు కాదనియు
వివరించెను.

సీత—ఆర్యపుత్రా! మీరుబుద్ధిపూర్వకముగ విసర్జించుచుంటకు నీమాయర్థాంగి సీతమిమ్మె న్నఁడును విడిచియుండదు. శక్తి స్వరూపయై సర్వకాలమును మీతోడ నీడ వలెనుండును.

శ్రీరా—సతీ! నే నెన్నఁడును నిన్నువిడువను. అట్లువిడువ వలసిరయే వచ్చినచో నీ శ్రీరాముని భూలోకమున లేనివానినిగఁదలంపుము.

సీత—నాథా! అనుగ్రహింపఁబడితిని.

(తెరలో నాకసమున)

అయ్యో! యేమి యీయన్యాయము? శ్రీరాముఁడు భార్యాలోలుఁడై ప్రజా పరిపాలనంబున విముఖుఁడగుచున్నాఁడు. ఈతనిపరిపాలనంబునఁ బ్రజలుసుఖపడి యుదరను కొంటిమి కానియీతఁడు రావణుఁడు మంచివాఁడనిపింమనని తలంపవ యితిమి.

శ్రీరా—సఖీ! వింటివాయీ ఖేచరుల మాటలు?

సీత—నాథా! నాకై ప్రజాపాలనంబును మానుట యుక్తముకాదు.

(ఆకసమున)

నాథా! యేమట్లను చున్నారు? శ్రీరాముఁడు న్యాయప్రవర్తనుఁడుకదా. ఆతని యందేమి దోషముకలదు?

లేను దోషమేమియునుండదు. రాజు స్త్రీలోలుఁడైన పిమ్మట రావణకృత్యము లేక ర్తవ్యములగును.

శ్రీరా—జానకీ! ఆకాశచారులగు వారలపల్కులు వింటివిగదా. (ఆకసమువంక జూచి) ఓనభశ్చరులారా! నాయందనుమానింపకుఁడు. ఈ మీసేవకుఁడు శ్రీరాముఁడు భార్యాలంపటుఁడై ప్రజాహితుండు కాఁడని నమ్మకుఁడు. ప్రజలకై సర్వస్వమును విడిచిపైచుటకు సంసిద్ధుఁడైయున్నాఁడు. తుదకుఁదన ప్రాణమైన మైథిలీదేవినిఁగూడఁ బరిత్యజించుటకు వెనుదీయఁడు.

సీత—ప్రాణేశ్వరా! నావలనమీకుఁగూడ నపఖ్యాతివచ్చుచున్నదిగదా, ఇపుడుమీరు రెండువాగ్దానము లొనర్చివారలు.

ఉ. జానకి నిన్ను నేవిడువ ♦ సత్యమునానుడియంచుఁ బల్కి—నా
రేను నిజంబుగాఁదలఁచి ♦ యెంచియు వార్షమునందియుంటిన
య్యో నినుఁగూడవీడెదన ♦ యోచితమైన బ్రజాళికంచు నీ
నానుడి నాలకింపవర ♦ నాథభయంబయె . నేమిసేయుదున్.

వినను సంతసంబయ్యెను.

మ. రఘురాముండు ధరాతనూజఁ గొని స్వ ♦ ర్గప్రాప్తికై శ్వర్యముల్
విఘటింపన్ సతతంబుఁ దద్రితులచే ♦ విశ్వంబుఁ బాలింపఁడీ
యఘముం బాయుట శక్యమౌనె జనులే ♦ యన్యాయముం జేసి రో
యఘుదూషండగు పార్థివుండిటుల కా ♦ ర్యాసక్తికిం జిక్కఁగన్.

అనుచు నపవాదలు రాకుండును గాక. నన్ను వీడుటకైనను సమ్మతింతును గాని ప్రజలను బోలిన ప్రియులను గష్టపెట్టుటకు సహింపఁజాలను.

శ్రీరా—(ముద్దిడుకొనుచు) సుందరీ! నిన్ను వీడుకొనను కొనకుము.

చ. మెలఁకువతోడఁ బాలనము ♦ మిత్రులమాత్యులఁ దోడు సూపఁ జేఁ
దలఁతును సర్వకాలము వి ♦ ధాతృసముండు వసిష్ఠుఁ డెయ్యెడం
దెలుపునవశ్యకార్యములు ♦ దివ్యవిధానమునం బ్రజాప్రధా
నులదరిఁ జేర్చియే లెదను ♦ న్యూనతఁ జేయక రక్తిఁ బెంపునన్.

దానవారలు నాకనురక్తులై సర్వవిధముల రంజితులై యుండెదరు. దాననే మియునవిష్టము వాటిల్లదు. రాజ్యాభిషిక్తుఁడు ధరణినిఁగూడఁ బట్టమహిషిఁగా స్వీకరించి యేలవలయును గదా. అందుఁ బట్టమహిషివలన ధారణీపరిపాలనమున కభ్యంతరము తటస్థించినచో నామహిషిని వీడుటయు న్యాయము కాదు. అట్టియెడల మాత్రమే నారెండవవాగ్దానము వర్తించును, నీవు నాకభ్యంతరము సేయువానవు కావు, కావున నట్టికృత్యము పొసఁగదు.

సీత—ఆర్యపుత్రా! ఖేచరులకు మీరొసఁగిన వాగ్దానము భయము నొదంలించుచున్నయది. కానిండు, దైవసంఘటన మెట్లు కలదో! ఒకవేళ నేనంతనిర్భాగ్యురాలను గాఁదగు సమయము వచ్చినచో నన్ను సర్వకాలము:—(అర్ధోక్తియం దూరకుండును)

శ్రీరా—మఱువవలదనియా చెప్పనది (కౌఁగిలించుకొని) జనకరాజనందినీ! నాకట్టియభాగ్యస్థితియేల దాఁపరించును. భీతిల్లకుము. సతీమణీ నీవంశమునుద్ధరించుచున్న నీయెడలఁ బ్రసన్నుఁడనైతిని, వరమెద్దియైనఁ గోరుకొనుము.

సీత—ప్రాణేశ్వరా! భగవంతుఁడవగు నీవే నాతోడనుండ నేఁ గాంక్షింపవలసినదియేది కలదు? మీవచనంబులు వ్యర్థంబులు కారాదు. కావున విన్నవించెద ననుగ్రహింపుఁడు.

తే. గీ. మౌనిపల్లెలయందు బ్రా ♦ హ్మణవనితల
సేవఁ జేయుచువారి యా ♦ శీస్సులందు

కోర్కె పుట్టెడుదాన మీ ♦ కొమరుఁడతుల
విప్రతేజోభి రక్షల ♦ వెలయుననుచు.

శ్రీరా—(తనలో) ఔరా! యీయతివ యిట్టికోరిక కోరినదేమి? ఇదివఱలో వనవాసముచేఁగడుఁ గృశించియు మఱల నదియే యభిలషించెడిని. (ప్రకాశముగా) సాధ్వీ! వనవాసమందలి కష్టములు నెఱిఁగియు నిట్టియభిలాషను దెల్పితివేమి? వేఱొండుఁ గోరుము.

సీత—

తే. గీ. సర్వదేవతలకడ న ♦ స్త్రములఁ గాంచి
గాధినందనుఁడు వసిష్ఠుఁ ♦ గాలునొద్ద
కనుపఁ గోరియు నాతని ♦ నక్షితోడ
నైనఁ జూడ నేరమి హేతు ♦ వరయరాదె?

ఆ. వె. సంతతంబు తపము ♦ సల్పు మునీంద్రులు
తాల్పయుండ్రు కోటి ♦ తపనతుల్య
కాంతియును సమాన ♦ కల్మషరహిత తేజ
మును దదీయవచన ♦ ములఁ దలంచి.

ఉ. మీకొమరుల్ ధరాతలిని ♦ మించి త్రిమూర్తులఁ గూడ గెల్చి ము
ల్లోకము లేలు శక్తిబున ♦ లోకము మెచ్చ వహించునట్లుగా
నాకగు కోర్కె కామునుల ♦ న్యాయ్యవచోవిధు లేవలంతుల
స్తోకతపస్వులౌ మునులఁ ♦ జూడఁ దలంచెదఁ బ్రాణనాయకా!

కావున నాకోర్కె రిత్త పుచ్చకుఁడు

శ్రీరా—కోమలీ! వనముల నెట్లు క్రిమ్మరుదానవు

తే. గీ. కుసుమ కోమలంబులు సుమ్ము ♦ క్షోణిజాత
నీపదంబులు వానినె ♦ ట్లీపరుషశి
లాతలముల నిలుప నేర్తు ♦ సీత నీవు
ముండ్లతోఁ గూడిన వన ♦ భూములందు.

ఉ. క్రూరమృగంబులుండు మృగ ♦ కోట్లు చరించు జలంబులుండవా
భూరివనాంతరాళమున ♦ బొబ్బ మెకంబుల బాధయుండు స్త్రీ
లూరక యా కిరాతులు మ ♦ దోద్ధతులుండు వనంబులందుఁ బోఁ
గోరుట యుక్తమా నెసతి ♦ కోరుము వేఱు వరంబు లిచ్చెదన్.

సీత—నాథా! నాకొండు వరంబక్కఱలేదు. నాయందు మీకు జనించు కుమారుల మానుషప్రతిభాసమన్వితులు నజేయులును గావలయును. భర్తకనురూపుఁడు కానిసుతునిఁగన్న కాంతబ్రదికియేమి ప్రయోజనము?

శ్రీరా—జానకీ! అట్లనేపోవుమవుగాక. భక్తితో మునీంద్రులను సేవించి సకలసద్గుణోపేతుఁడగు పుత్రునిఁ బ్రసవించి నీవుకరించి నన్నుఁదరింపఁ జేయుము. (కౌగిలించుకొని ముద్దిడుకొనును.)

సీత—(సిగ్గునఁదలవంచుకొనును.)

శ్రీరా—(సంతోషముతో) ప్రాణేశ్వరీ! గర్భవతియగు కాంతభర్తకొసఁగు నానందమునకు మేరయుండదు. అతఁడుపిత్రృణముక్తుఁడగునుగదా, అట్టికాంతధర్మపత్నియై యుండుట మఱియు సంతోషమునిచ్చును. నీవలన నాకిపుడు కలిగిన ప్రమోదము నేనిఁక నెప్పుడునుబొందను. కావున నీకోరికలన్నియు నెఱవేర్ప సంసిద్ధుఁడనై యుంటిని. కోరుకొనుము.

సీత—ప్రాణేశ్వరా! కోరితినిగదా. మఱలనేవి కలవు. అయిన నిదికూడఁ బ్రసాదింపుము.

తే. గీ. ప్రాణనాథనీవలన నేఁ • బడయుపుత్రుఁ
డెల్లయస్త్రములనుగల్గి • హృద్యగుణము
లనుభరించి యీపుడమినే • లంగవలయు
యౌవరాజ్యంబునీచేత • వందవలయు.

ఇదియొక్కటియే కుమారునికొఱకై కోరఁదగినది.

శ్రీరా—(సంతోషముతో) సుందరీ! నీభక్తికి మెచ్చితిని. కోరుకొమ్మనిన నిట్లు కోరుకొనుట యా? మొదటికోరిక నావంశవర్ధనుఁడగు పుత్రుఁడు బ్రహ్మర్షివచోలబ్ధవైభవాది సమన్వితుఁడు కావలయుననియు రెండవది న్యాయవిధిలభ్యంబగు రాజ్యంబౌరసునకు వేఱుగఁ, గోరుటయు నా? సకలసద్గుణోపేతవగు నీవు ధర్మపత్నివగుట నాయదృష్టముకాదె? కైకకోరిన వరంబులను దలంపవేమి?

సీత—నాథా! ఆమాటలను దలంపకుఁడు. (ఆలకించి) ఆదెసనెద్దియోయలజడి యగుచున్నది. ఏమైయుండును?

శ్రీరా—(చూచి)ఎవరోవచ్చుచున్నటులున్నది. అడుగులచప్పుడగుచున్నది. (తెరలోనికిజూచి) ఎవరువారు?

(తెరలో) దాసుఁడు లక్ష్మణుఁడు వేచియున్నాఁడు. ఆజ్ఞయేమి?

శ్రీరా—తమ్ముఁడా! లక్ష్మణా! రమ్ము. నీవుకూడ నిట్లు వేచియుండవలయునా?
నీవు నాబహిఃప్రాణమవు కావా?

లక్ష్మ—(ప్రవేశించి సీతారాములకు నమస్కరించి నిలుచును.)

శ్రీరా—తమ్ముఁడా! సంగతులున్నవా?

లక్ష్మ—(తనలో) అసమయమున వచ్చితినిగాఁబోలును. అన్నగారిట్లడుగుచున్నారు. (ప్రకటముగా) దేవా! మఱేమియును లేవు. అత్రిమహామునీంద్రుఁడు తీర్థాటనమునకై పోవుచు మార్గమగుటచే నిటకు విచ్చేసి నాచే నర్ఘ్యంబుఁగొని శ్రీరామచంద్రుఁడు సత్పుత్రవంతుఁడగునని దీవించితినని చెప్పుమనుచుఁ గాల్యకృత్యములొనర్చుకొనఁబోయెను. ఆమహాత్ము నిరాక మీకెఱింగింపఁదలఁచు నంతలో నామునీంద్రుఁడు మఱలవచ్చి మిమ్ములను జూచిపోయెదననుచు నిష్క్రమించె.

శ్రీరా—అయ్యో! యెంతపనిఁజేసితివి. మహాత్ములసందర్శనము మహాభాగ్యముగదా.

సీత—లక్ష్మణా! నీవేమిచేయగలవు? ఆయనకు మాయందనుగ్రహము తప్పియుండవలయును.

లక్ష్మ—అమ్మా! అట్లుకాదు మీకు సత్పుత్రుఁడుదయించునని యాశీర్వదించినయాతఁడు తిరస్కృతుఁడని యెంచరాదు. మీసేవకుఁడనగు నన్నుఁ దరింపఁ జేయుటకట్టులా 'రించియుండును.

శ్రీరా—సరియే. కానిమ్ము మఱల వచ్చినయప్పుడైనను వ్యర్థముఁజేయకుము. ఆమునీంద్రుఁడు త్రిమూర్తులను బుత్రులనుగాఁ బొందిన యసమానతపస్సంపన్నుఁడు ఎవ్వరి వరశాపములైనను దిరుగునుగాని యాతనివి వ్యర్థములు కావు.

లక్ష్మ—చిత్తము. చిత్రకారుఁడు దేవరవారి వనవాస చర్యలన్నియు నొకమందిరంబునఁ గుడ్యములపయిఁ జిత్రించియున్నాఁడు. మాజనయిత్రి తనపూర్వానుభూతవిషయంబులఁజూచి నిచ్ఛగించునేని చూడవచ్చును.

సీత—లక్ష్మణా! ఆయిడుములు తలఁపునకు వచ్చినప్పుడెల్ల నాకగు వేదనఁ జెప్పరాదు. మఱల నన్ను శ్రమపెట్టకుము.

ఉ. రావణుఁడా వనస్థలిని ♦ బ్రాహ్మణవేషముతోడవచ్చినన్
భావమునందుఁగోరి తన ♦ పట్టపురాణివికమ్మఁటంచు దు
ర్భావముతోడఁ బల్కుటయుఁ ♦ బక్షివరేణ్యునిపాటు లంకలో
నావనటందలంచిన మ ♦ నంబున భీతిజనించె లక్ష్మణా!

కావున నేఁజూడఁజాలను. అతనికర్హమైన బహుమతి నిచ్చిపంపివేయుము.

లక్ష్మ—అమ్మా! అట్లనే పంపించెదను.

శ్రీరా—తమ్ముఁడా! మనంబున దిగులు గానిపించుచున్నది.

లక్ష్మ—

చ. మునివరుఁ డత్రిపోయెనని ♦ పొందనయుక్తము దుఃఖమీవు నె
మ్మనమున దాననీదిగులు ♦ మానవనాయక! వచ్చెనేమొ వే
అనఁదగు కారణంబు హృద ♦ యంబునఁ దోపఁదు బాంధులెల్లరున్
జనులును సౌఖ్యముండిరి ప్ర ♦ జాపతి ఏదిగు లేల వచ్చెనో?

తే. గీ. అంబ సౌఖ్యముగా నుండె ♦ నంతిపురిని
ధర్మపత్ని గర్భవతియై ♦ తనయుఁ గాంచుఁ
గొలఁదిదినముల, ధనముండెఁ ♦ గోశమందుఁ
బ్రజసుఖంబుండె ధృతిపీడ ♦ భాగ్యమగునె?

దేవా! నిక్కవ్వరు నెదురాడరు. నీవారెల్లరును సుఖంబున్న వారు అకారణంబుగ నీదిగులు పాటేల సంభవించియుండును? అనిష్టము లేవయినను దటస్థింపనుండెను గాబోలును.

ఉ. రాజులు వశ్యులైరి సుర ♦ రాయుఁడు మైత్రివహించె సర్వర
క్షోజయమందినావు ముని ♦ సంఘము దీవనలిచ్చె సాధ్వియా
భూజ కుమారుఁ గాంచు తఱిఁ ♦ బొందె జనంబను రాగమందె నీ
కీజగతిన్ సమానులు మ ♦ హీపతులొక్కరు లేరు చూడఁగన్,
అట్టినీకుఁ గూడ దిగులు కలుగుటకుఁ గారణము పొడగట్టదు,

సీత—(భయముతో) నాథా! దిగులేల? ఏదైననకృత్యముం బొనర్చితిరా?

శ్రీరా—ప్రేయసీ!

మ. పరకాంతామణిఁ గోరలేదు పరులన్ ♦ బాధింపగాలేదు భా
సురతేజోవిభవాభిరాములగుచున్ ♦ శోభిల్లు భూదేవతల్
కరుణంబాసి శపించలేదు పలుకన్ ♦ గాఠిన్యపుం బల్కులం
బరులందిట్టను సల్పసస్కృతులు నా ♦ భాగ్యంబు ప్రాణేశ్వరీ!

ఉ. ఏమని చెప్ప నేర్తు ధర ♦ ణీశుఁడనైన దిగుల్వహింపనా
కోమదిరాక్షి పాలమున ♦ నొయ్యనవ్రాసె విధాత లేనిచో
శ్రీమతివైన నీవును బ్ర ♦ సిద్ధచరిత్రులు తమ్ములుండనా
కీమతి వేదనల్ గలుగ ♦ నేల యనిష్టము లేవి కల్గునో?

సీత—నాథా! దిగులందకుఁడు. ధైర్యమును వహింపుఁడు.

ఉ. ధైర్యముసాయమౌను విబు • ధప్రతిమానునకున్న ప్రేలకున్
శౌర్యముధైర్యముంగలుగ • సంపదలబ్బును సార్వభౌముఁడౌ
సూర్యసమానతేజుఁడయి • శోభిలునాతఁడుప్రాణనాథ!యౌ
దార్యముకల్గువంతవివి • ధంబుగఁగీర్తిలభించువానికిన్.

లక్ష్మ—దేవా! యీమూఁడులోకములందును మీమాటకుజవదాఁటువారలేరు. కాలుఁడుకూడ మీకు వశవర్తియైయుండినాఁడు. ఇఁక మీకనిష్టములెట్లుతటస్థించును. సర్వమును మీయభీష్టము మేరకు జరగును.

శ్రీరా—తమ్ముఁడా! నీవుచెప్పినయనునయోక్తులవశ్యగ్రాహ్యములేకాని నామంబున నకేలనో సమాధానముఁగలిగింపకున్నవి. నామనమునందలి దిగులుతగ్గుటలేదు. (సీతతో) ఒకింత తడవు విశ్రమింతునా?

సీత—నాథా! అట్లనేవిశ్రమింపుఁడు. (సీత కూరుచుండఁగా నామెతొడపైఁదన శిరముంచుకొని శ్రీరాముఁడు నిదురించును. లక్ష్మణుఁడు కొంచెము దూరముగా నిలువఁబడును.)

సీత—లక్ష్మణా! కూరుచుండుము. మీయన్నగారియీవచనముల నాలకించిననాకును భయమగుచున్నది.

లక్ష్మ—(నిల్చియే) అమ్మా! భయములేదు. దేవతలు కృతజ్ఞులై సర్వకాలము మనలను గాపాడుచునేయుందురు.

సీత—“స్త్రీణాంప్రసూతిర్గండః” అని పెద్దలు చెప్పుదురుగదా.

లక్ష్మ—తల్లీ! భయములేదు. మనయందఱముఖంబులందును సంతోషచిహ్నాలు మాత్రమేకానిపించుచున్నవి,

సీత—నాకై భయములేదుగాని మీయన్నగారేకపత్నీవ్రతమును వహించుటతలంచిన నాకమితమైన భీతిజనించుచున్నది.

లక్ష్మ—అమ్మా! మీకుప్రాణభయముకలుగునని సందేహమక్కఱలేదు. మీసేవకుడగునేనును హనుమంతుఁడును మీరుచెప్పినట్లు చేయసంసిద్ధులమై యున్నవారము.

సీత—అట్లయినచో మీయన్నగారిసావ్రతమునుండి త్రిప్పుఁడు. నేనుజీవించియున్నంతవఱకానియమమున్నను బాధలేదు, పిమ్మటమాత్రమట్లుకూడదు.

శ్రీరా—(కోపముతో) ఓరోరి దురాత్ములారా! నాభార్యనుదీసికొనిపోయెదరేమి? మీకుఁబ్రాణములుఁదక్కునా? సీతనువిడిచి శ్రీరాముఁడుండఁగలఁడా? అమరులమని గర్వించుచున్నారా? మీయమరత్వమును నిమిషములో సాధించెదను. నిలువుఁడు. (కలవరించును.)

సీత—(ఆత్రముతో) నాథా! అదియేమి? అట్లు కలవరించుచున్నారు. మీయర్ధాంగి
గు నేనిక్కడనే యుంటినిగదా.

శ్రీరా—(లేచి) లక్ష్మణా! మీవదినెను దేవతలు హరించుచున్నారు. ఊరకొనియుంద
వేమి? వెంటనే ధనుర్బాణముల నిటులిమ్ము.

లక్ష్మ—దేవా! కలవరించుచున్నా రాయేమి? జనకనందన మీసన్నిధానమున నేయు
న్నదిగదా.

శ్రీరా—(మెలకువతో) ఏమి? నాకు నిద్రపట్టినదా? ఇది స్వప్నమా?

సీత—ఏమని స్వప్నము వచ్చినది.

శ్రీరా—సుందరీ! చతుర్ముఖుడును దేవేంద్రపురస్కృతులగు దిక్పాలురును ముందుఁ
గానిపించినారు. వారేదియో సంభాషించుకొనుచుండునంతలో సరస్వతివచ్చి
నది. వారామెతో నేదియో చెప్పినారు. ఆమె తలయూచినది. అంతలో
వారంతర్ధానమయినారు. పిమ్మటఁ గొంతపడికి బ్రహ్మయు దేవేం
ద్రుఁడును నిన్నుఁగొనిపోవుచున్నట్లు కానిపించినది. శక్రుఁడు వజ్రహస్తుఁ
డై నిన్నుఁగాచుకొనుచుఁ బోవుచున్నవాఁడు. వారినిఁ జూచినంత నాకుమిక్కిలి
కోపమువచ్చినది.

సీత—అదియేమి? మీరు మొదటినుండియు దిగులుఁబడుచున్నారు దానికనురూపముగ
మీమనస్సు చలించుటచే నిట్టిస్వప్నము వచ్చినది మీసన్నిహితమున నున్న నన్నా
దేవేంద్రుఁడు మాత్రము కొనిపోఁగలఁడా?

శ్రీరా—మిత్రునివలెఁ గానిపించి యాశతక్రతుం డెంతపనిఁ జేసినాఁడు. అతని కహల్యా
జారుఁడను నింద యూరకవచ్చినదా?

లక్ష్మ—అన్నా! రఘువంశవర్ధనా! ఊరక దేవేంద్రుని నిందింపకుఁడు, అతఁడు మనకప్ర
కృతిఁ జేసినవాఁడు కాఁడు. మీవలన రాజ్యమును బొందినవాఁడు.

శ్రీరా—వానికి బ్రహ్మయే సలహాచెప్పి తనభార్యయొక్క సహాయముచే సీతను హరిం
పఁజేసెను.

సీత—ప్రాణేశ్వరా! నేనిక్కడనే యుంటినిగదా, అకారణముగా వారిపైఁ గోపిం
తురేల?

లక్ష్మ—ఇప్పటిస్థితి బాగుగలేదు. అన్నా! మనసుకుదురు పర్చుకొనుఁడు. మనకేదియు
విపత్తు రాలేదు.

శ్రీరా—(స్తిమితపడి) లక్ష్మణా! స్వప్నవృత్తమెంతకలవరముఁగలిగించినది? ఇఁకమ నమంతఃపురమునకుఁబోవుదము.

సీత—నాథా! నేనిక్కడనేయుంటిని: తెలివివచ్చినదా?

శ్రీరా—(కౌఁగలించుకొని) సుందరీ' తెలిసినది. రమ్మపోవుదము.

లక్ష్మ—మంచిదిరండు. (లక్ష్మణుఁడు దారిచూపఁగా సీతారాములునిష్క్రమింతురు) తెరవాలును.

ఇయ్యది శ్రీమదాత్రేయవిరచితంబగు నుత్తరరామచరితంబనఁబడు దృశ్యకావ్యంబున సీతాపరిదానంబనునది ప్రథమాంకము.



# ఉత్తరరామచరితము

## ద్వితీయాంకము

రంగము. సాకేతపురము నందలి రాజమార్గము.

లక్ష్మ—(ప్రవేశించి) హా దైవమా! యెంతపనిఁజేసితివి. నేనెంత నిర్భాగ్యుఁడను. శ్రీ రాముఁడు నన్నీఘోరకృత్యమున నేలనియోగింపవలయును? హా దుర్భరము దుర్భరము.

సిద్ధా—(ప్రవేశించి) లక్ష్మణకుమారా! యేలవిచారముగానున్నాఁడవు?

లక్ష్మ—అమాత్యవర్యా! నాయిడుముల నేమని విశదీకరింతును? ప్రేష్యజీవనము శత్రులకయినను వలదు.

సిద్ధా—రాజకుమారా! ఏమట్లు వాపోవుచున్నాఁడవు?

లక్ష్మ—ఆర్యా! యేమని చెప్పను. నిన్నఁటిరాత్రి శ్రీరామచంద్రుఁడు ప్రచ్ఛన్నవేషధరుఁడై పురమందలి విశేషములరయఁగోరి తిరుగుచుండెను.

సిద్ధా—మహారాజుగారి కయ్యది పరిపాటియే కదా, ఏవైనను వార్తలను వినినారా?

లక్ష్మ—ఏమని చెప్పుదును. ఆరాత్రి మహారాజుగారు రాజవీథులన్నియుఁ దిరిగి తుదకుఁ జాకలివాడఁ బ్రవేశించినారు.

సిద్ధా—చొరరాని తావునకుబోయినారు. (ఆత్రముతో) అచ్చో నేదైనను విపత్తు తటస్థింపలేదుగదా. వాండ్రు రాత్రి యొడలు తెలియక చరించుచుందురు.

లక్ష్మ—అంతకంటె హెచ్చుగనే తటస్థించినది.

సిద్ధా—(తొందరతో) ఏమది?

లక్ష్మ—ఒకరజకుఁడు తనభార్య తనయనుమతిలేనిదే పుట్టినింటికిఁబోయెనని యామెను నిర్బంధించుచున్నాఁడు. వానిబంధువులు నిరుగు పొరుగులవాండ్రును వచ్చి యెన్నియోవిధముల నచ్చచెప్పుచుండిరి. కానివాఁడు వినకయుండెను.

సిద్ధా—ఇందునవిపత్సూచన లేవియు లేవే.

లక్ష్మ—తొందరపడకుము. అంతనాతఁడు రావణుండు తనపట్టణమున నొకసంవత్సరముంచుకొనిన సీతను రాముఁడు తెచ్చుకొని తనకీర్తినిఁబోగొట్టుకొనెను. ఆతఁడు మహారాజు కావున నెదుటననుటకుఁజంకుచున్నారు, నన్నైనచో నిలువనీయరు. నీతిపోయినను భార్యయే ప్రాణమనుకొనిన రాముఁడట్లు చేసినఁ జేయు

నుగాక; నేనుమాత్రమిట్టిహీనకృత్యమును జేయనని యాతఁడు వారలనందఱ
నదిరస్కరించుచుండెను.

సిద్ధా—(ఆత్రముతో) అయ్యో! ఆమాటలను మహారాజుగారు వినినారాయేమి?

లక్ష్మ—అగును. వెంటనేయాయనవచ్చినన్నుఁబిలిచి సీతనడవిలో విడిచిరమ్మని యాజ్ఞా
పించినారు

సిద్ధా—(విచారముతో) నిర్దోషురాలగు సీతకెట్టి యాపద ఘటిల్లెను. (లక్ష్మణుని
తో) కుమారా నీవైనను రామునిఁబ్రార్థింపకపోయితివా?

లక్ష్మ—మాసోదరులందఱము బ్రతిమాలితిమి. ఒకించుకయుఁ బ్రయోజనము
లేదాయె.

సిద్ధా—గురువులగు వసిష్ఠవామదేవాదులు చెప్పినను వినకపోయిరా?

లక్ష్మ—ఇతరులకెవ్వరకును దెలియదు.

సిద్ధా—(ఆశ్చర్యవిచారములతో) ఎంతరహస్యముగా జరిగినది. యీదారుణకృత్యము.

లక్ష్మ—వనవాసకాలమున నామెను మాతృభక్తితో సేవించిన నాచే హా దైవమా!
యీదారుణకృత్యమును జేయింతువా? దిగులుతోఁగూలఁబడును.

సిద్ధా—కుమారా! అధైర్యపడకుము లెమ్ము. ఆపదలుకాపురములుండవు.

లక్ష్మ—అయ్యా! నాబాధయేమిచెప్పుదును? ఇపుడక్కడకుఁ బోయి జనకరాజనంది
నితో మాయయుక్తితో ననృతమాడవలయును.

సిద్ధా—నీవా! అనృతమా? శ్రీరాముని యాజ్ఞయేనా?

లక్ష్మ—గర్భవతియగు నామె ముపల్లెలకుఁబోయితాపసకాంతలను సేవింపఁగోరిన
దఁట. ఆమిషచేనామెను గొనిపోయి యరణ్యమునవిడిచి రావలసినదిగా రామా
జ్ఞగలదు.

సిద్ధా—ఆవార్త తెలియగానే సీతప్రాణమువిడుమను.

లక్ష్మ—ఒక్కయామెయే కాదు. ఈకార్యము రఘువంశమంతరించుటకై దాఁపురిం
చినది.

సిద్ధా—కానున్నది కాకమానదు. విధియిదివఱకే లిఖించియుండుటచే మనమిందులకై
విచారించిన ఫలములేదు. ధైర్యమును దెచ్చుకొని కర్తవ్యము నిర్ణయింపుము.

లక్ష్మ—అయ్యా! నాకేమియుఁదోఁచుటలేదు. ఎట్లుజరగింతునో తెలియుటలేదు, పోయి
వచ్చెద, అదిగో యంతఃపురము, ద్వారపాలురచే నారాక మైథిలీదేవి కెఱిం
గించెద.

---

ఈయుపోద్ఘాతములు సరస్వతీ పవర్ ప్రెస్సందు ముద్రింపబడినవి.

సిద్ధార్థుఁడు— నేను బోయి మైత్రావరుణుల కీవార్తఁ జెప్పి మానిపించుటకై ప్రయత్నించెద. నీవు ధైర్యముతో నుండుము. నేనీమార్గముననే వసిష్ఠాశ్రమమున కేగెదను.

లక్ష్మ— సరియే. (ఇద్దఱును నిష్క్రమింతురు,)

ఇది విష్కంభము.

రంగము:— సీతాదేవియొక్క యంతఃపురము.

నిండుచూలాలగు సీతయు నూర్మిళయుఁ బర్యంకములపయిఁ గూర్చుండురు.

(మంజువాణియుఁ గలభాషిణియు దూరముగా నిలిచియుందురు.)

ఊర్మిళ— అక్కా! నీవెంతయు నదృష్టవంతురాలవు.

చ. ధరణిఁ జనించినావు గుణ ♦ ధన్యవు సుందరి వచ్ఛశీలవై
పరయశమందియుంటివి ప్రి ♦ భూపతికిన్ దులాసమానవై
చిరతరరాజ్య సౌఖ్యముల ♦ సిద్ధమనోరథ పాలినందితే
నరపతితుల్యులన్ సుతుల ♦ శౌర్యనిధానులఁ గాంతు వర్షులన్.

సీత— అమ్మాయీ! యూర్మిళా! నాకష్టసుఖములు మీవికావా! మీవినావికావా!

చ. వనములయందు నీమగఁడు ♦ భవ్యచరిత్రుఁడు సేవసేసె మా
కనవరతంబు మాకిడెఁ బ్రి ♦ హర్షము మమ్ములఁబ్రోచె స్వీయ జీ
వనమునె లెక్కసేయఁడు ♦ విభీకరతుల్యుఁడు వానిదేసుమా
మనదను రాజ్యమంతయు స ♦ మానమె హెచ్చొయతండు మాకగున్.

అతని రక్షణముననే మేమిట్లు సుఖించుచున్నారము. రాజ్యమంతయు నాతనిదే. జ్యేష్ఠులము మేముండఁగా నాతఁడు రాజ్యమును స్వీకరింపఁడని యిట్లు పట్టాభిషేకముఁజేసి కొంటిమికాని వేఱుకాదు.

ఉ. ఊర్మిళ! నీమగండు విభ ♦ వోజ్జ్వలుఁడై యువరాజునై మహా
కార్ముకధారియై ధర న ♦ ఖండపరాక్రమశక్తి నేల తే
ర్కోర్మివహించి సౌఖ్యముల ♦ నొందుచునుంటి మతండె పుత్రుఁడై
కూర్మిఘటించు మాకు సుమ ♦ కోమలి! రాజ్యమువానిదేయగున్.

శా. రాజ్యంబుం బెడఁ బాసిపోవుఘనునిన్ ♦ రామున్ గుణాంభోనిధిం
బ్రాజ్యంబై తనరారు భక్తిమదిఁ దోఁ ♦ పం బోయి సేవించుచున్.
రాజ్యం బేవనమంచుఁ బల్కుఘనుఁడే ♦ రా! లక్ష్మణాఖ్యుండు సా
మ్రాజ్యాధీశ్వరుఁడే సతండె సుదతీ! ♦ మాన్యుం డతండే ధరన్.

అతఁడన్నను పినగ్రిజనుగ నిట్టి రక్షించుచుండ మాకేమికొఱలయును ?

తే. గీ. ఏవిధంబున మీరు మ ♦ మ్మేలినారొ?
యదియెఱిఁగిని నాసుతు ♦ లరయుచుండ్రి
మిమ్మధికభక్తి సేవింత్రు ♦ మేటిమునులు
యుక్తమనుచు నుతింపనో ♦ యూర్మిళాంబ!

ఊర్మిళ—అక్కా! మీరు పెద్దవాండ్రగుటవలన మాకుఁ బూజ్యులు. సర్వలక్షణ సంపన్నంబగు నీముఖారవిందంబుఁ దిలకింపనెనని కిభక్తి యుదయింపకుండునా? నాఁటి నీయగ్ని ప్రవేశంపు సమయంబున మీమఱఁది పొందిన విచారమునకు హద్దుకలదా?

సీత—సందేహమేమి? పదియునూఁడు వత్సరంబులు మహాభక్తితో సేవించిన నేను భర్త్ర విరహితనై నిందంబొంది యగ్నిజ్వాలలఁ జొచ్చుచుండ:—

తే. గీ. షోడశకళలవహియించి ♦ సొబగుఁగాంచు
చంద్రు నెదిరించు వదనంబు ♦ సారసాక్షి
నాయనల గమనంబున ♦ పోయటంచు
నేప్వఁగళఁ బాసి దినమందు ♦ నిందుఁబోలె.

అప్పటి యాతని ముఖంబుఁ జూచిన మరణంబునఁ గృతనిశ్చితనగు నాకును విచారము కలిగినది. ఏమాతని యకలంకభక్తి? ఎవ్వఁడట్టిత్యాగముఁ జూపును?

తే. గీ. యౌవనంబున ననురూప ♦ యైన భార్య
గమలనేత్రను విడనాఁడి ♦ కానలకును
బూర్వజపరిచర్యకునయి ♦ పోఁదలంచు
మహితగుణుఁడెందు నుండు ల ♦ క్ష్మణుఁడుతక్క.

ఊర్మిళ—అక్కా! అది యాయనకు విధికదా?

మంజువాణి—అమ్మా! భగవంతుఁడు మాత్రమెఱుఁగఁడా? సన్మార్గులను రక్షింపఁడా?

ఉ. మీరలు కాననంబునకు ♦ మీనవిలోచన! పోయినంతనా
ధీరుఁడు లక్ష్మణుండు వర ♦ దివ్యచరిత్రుఁడు నిద్రవీడెనన్
ఘోరన నిద్దివచ్చిననఁ ♦ బోఁడిని నూర్మిళఁ బొందె వెంట నే
యీరతనంపుబొమ్మ శయ ♦ నించెఁ జతుర్దశవత్సరంబులున్.

అందువ నీపవిత్రచరిత్ర వియోగవ్యథ నొక్కింతయు నెఱుఁగదు. సౌమిత్రి మాత్రము నిగ్రహీతేంద్రియుఁడౌటవలనఁ దా విరహితుండయ్యుఁ దన విచారంబు వెలువడ

కుండ దాఁచి రఘురాముని నోదార్చుచుండెను. (ఆశ్చర్యముతో) ఏమాతని నిగ్రహ శక్తి (సీతఁజూచి) దేవీ!

ఉ. సుందరుఁడైన పూరుషునిఁ ♦ జూచినఁ గామినిచిత్తమెంత యుం
గొందలపాటునొందు సుమ ♦ కోమలిఁజూచిన యౌవనాఢ్యుఁడా
త్మం దలపోయు నాసుదతిఁ ♦ దామరసేక్షణఁగూడు ఛక్కి యీ
చందము రాఘవానుజుని ♦ సన్నిధిఁ గానము కోసలేశ్వరీ!

అతని చరిత్ర మేమని చెప్పవచ్చును.

చ. పరసతిఁగాంచినందొలఁగి ♦ భక్తిఁ బహించును మాతృబుద్ధిమై
వరమతివారి యాపదలఁ ♦ బాపును శక్తికొలంది ధర్మత
త్పరతఁ దలంచి కర్కశప ♦ దంబులవాడఁడు శక్తహీనులన్
గరుణచెలంగ లక్ష్మణుఁడు ♦ కావఁదలంచును సర్వకాలమున్.

సీత—మంజుభాషిణీ! నీవు పలుకు వచనములన్నియు సత్యములు.

(తెరలో) ఎవరక్కడ? మంజుభాషిణీ!

మంజు—చిత్తము వచ్చుచున్నాను. (నిష్క్రమించును.)

ఊర్మిళ—ఎవరాపిల్చినది?

సీత—(చిఱునవ్వుతో) నీ ప్రాణేశ్వరుఁడు. నామఱఁది. లక్ష్మణుఁడు.

ఊర్మిళ—(చిఱునవ్వుతోను సిగ్గుతోను దలవంచుకొనును.)

(తెరలో) జానకీదేవిగా రిక్కడ నేయున్నారా? నారాకను దెల్పెదరా?

(తెరలో) చిత్తము.

మంజువాణి—(ప్రవేశించి సీతతో) అమ్మా! మీమఱఁది ద్వారముకడ వేచియు

న్నాఁడు.

సీత—లోనికిఁ దీసికొనిరమ్మా.

మంజు—(నిష్క్రమించి లక్ష్మణునితోఁ బ్రవేశించును. ఊర్మిళ తొలఁగి నిలుచును.)

లక్ష్మ—(సీతకు నమస్కరించును.)

సీత—(పీఠముఁజూపి) సౌమిత్రీ! ఆ యాసన మలంకరింపుము.

లక్ష్మ—(కూర్చుండును.)

సీత—(మందహాసముతో) లక్ష్మణా! మాచెలియ లిక్కడనున్నదనియే విని యి

టువచ్చితివా?

లక్ష్మణ—అమ్మా! మహారాజుగారియాజ్ఞచే వచ్చియున్నాను. మీరు మునాశ్రమం

బులకు మహర్షి దర్శనార్థమై పోవలయునని వారిని మీరు కోరితిరంట నన్ను బిలిచికొని పొమ్మని యాజ్ఞాపించినారు.

సీత—నేను గడుధన్యురాలను. ఆర్యపుత్రుండింత శీఘ్రముగా నాకోరిక నెఱవేర్చునని యనుకొనలేదు. ఇంతటి యనురాగమునకుం గారణమేమియో ?

లక్ష్మ—(విచారముతోం దనలో) దైవమా ! యెంత ఘోరకృత్యమును గావించుచున్నావు. ఈ మెయవ్యాజప్రేమ పూరిత హృదయకదా! ఇట్టి యీమెకో యీపరిత్యాగము ? మోసమన్నపదమే యెఱుంగని యీమహాపతివ్రతా శిరోమణిని నేను వంచనచేసి యరణ్యమున విడిచిపెట్ట దలసివచ్చినది. ఇది జరుపుటకెంతకఠిన హృదయము కావలయును? విధి నానొసట నీవిధి లిఖించియుండంగా నీగతి యిట్లుగాక యేమగును ? (తలవంచుకొని విచారము బయటికిం దోంపకుండ నుండును.)

కల—అమ్మా ! మేముకూడ రావచ్చునా ?

సీత—వలదు.

ఊర్మిళ—అక్కా ! యీపర్యాయము నేను వచ్చి నీకు సేవంజేసెదను. ఇందులకు మీమఱందిగారు సమ్మతింతురు.

సీత—చెలియలా ! వలదు, వలదు, నేను గొలందిదినములలోం దిరిగి వచ్చెదను. కాన నాకెవరును సహాయము రానక్కఱలేదు, లక్ష్మణుండన్నివిధముల నాకు సహాయముం జేయంగలండు.

లక్ష్మ—(తనలో) అయ్యో ! నేనెంత నిర్భాగ్యుండను. ఈమహామాత నేను గావింపనున్న మహాద్రోహమును దలంపక యెట్లు పలుకుచున్నది. కటకటా! నేను బ్రదికియేమి ప్రయోజనము ? దయార్ద్రంబగు మదీయహృదయము నేండు శిలాసదృశము కావలసియున్నది.

మంజు—అమ్మా ! వైదేహీ ! కుసుమకోమల శరీరమును గలిగి సంపూర్ణ గర్భభారమును వహించుచున్న నీవెట్లు కర్కశశిలాతలంబుల నడువనేర్తువు మేము కూడనుండి నిన్ను సేవించుచుందుము.

సీత—మంజువాణీ ! మీరలు కూడ వచ్చినచో నాకు సౌఖ్యమేయగును, కాని వారలకు శాంతిభంగమగును.

చ. తపమొనరించుచుండు ముని • తల్లజు లాశ్రమసీమలందు భూ
త పతిందలంచుచున్ భజన • తత్పరులై వసియించుచుండ్రు ధ్యా

నపరులువారు సాత్త్వికులు ♦ న్యాయచరిత్రులు శాంతిభంగమై
నపుడువహింతు రోపము రు ♦ లాపతి ఘూధృతికొంగ నేర్తురే!

చం. అడఁకువతోడ వామునుల ♦ కర్చనఁజేసి ముదంబుఁగూర్చి వా
రిడనెడఁ గూర్చు కష్టముల ♦ కేమియు నోర్వక యోర్మి పెంపునం
దడవుల నిల్చి తద్రిపుల ♦ నారసి కూల్చినవారు తృప్తులై
కడుఁగరుణాత్ములై సకల ♦ కాంక్షలఁదీర్తురు దివ్యవాక్యులై.

ఊర్మిళ—అగును. పదునాలుగేండ్లు వారితోఁ గలసిమెలసి యున్న వారు వారల స్వభావము బాగుగఁ దెలిసియుందును.

సీత—రాజులతోఁ జెలిమిత్రాఁచుఁ బాముతోఁ బగయుంచుకొని మునులతో డ్డిచెలి మట్టిదికాదని నేను వక్కాణింపఁగలను.

లక్ష్మ—అమ్మా! ప్రయాణమున కౌలస్య మేమైనఁ గలదా?

సీత—లేదు. మంజువాణీ! ఆశ్రమ ప్రయాణమున కనువగువస్త్రాది పరికరములను సమకూర్చుము.

మంజు—చిత్తము. (నిష్క్రమించును.)

సీత—ఊర్మిళా! నాకై విచారింపకుము. కొలఁది దినములలోనే తిరిగి వచ్చెదను. నీమగఁడు కాపాడుచుండఁగా నాకేమియు ననిష్టము కలుగదని యెంచుము.

ఊర్మిళ—అక్కా! నిన్ను విడిచియుంకుట కడుంగడు కష్టముగానుండును. ఎట్లయిన నన్నుఁగూడఁ దీసికొనిపొమ్ము.

సీత—అమ్మాయీ! వలదు. (లక్ష్మణునితో) లక్ష్మణా! రథమాయత్తముఁ జేసికొనిరమ్ము.

లక్ష్మ—(నిష్క్రమింపఁగాఁ దెరవాలును.)

ద్వితీయరంగము వాల్మీక్యాశ్రమ సమీపారణ్యము.

ప్రవేశము గర్భభారాలసయగు సీతయు ధనుష్పాణియగు లక్ష్మణుఁడును.

సీత—లక్ష్మణా! మీయన్నగారికి నాయందుఁగల యనురాగమునకు మితిలేదుగదా!

ఉ. కోరినవెంట నేయనిపెఁ ♦ గొంకక నన్వనసీమకున్ రహిన్
భూరిమహత్త్వసత్త్వవిభ ♦ వుం డుడు ధీయుఁడుకాని పల్లెలం
దోరిమిమైఁ జరింపుమని ♦ యొక్కఁడనైన నతిక్రమింపఁడా
శ్రీరఘురాముఁడట్టి ధవు ♦ చేరువనుండుట యెట్టిభాగ్యమో.

ఉ. సుందరమైన యీమొగముఁ ♦ జొక్కపుదివ్యశరీరకాంతి మే
నందనరారువస్త్రమును ♦ న్యాయచరిత్రముఁగల్గి దీవర

క్షం దగు రామచంద్రుని వి • శాలయశస్కుని నాథు రా
జేంద్రునిఁ బాసి యుండుట స • హింపఁగరాదు సుమయ్య లక్ష్మణా!

చం. వరమును గోరుకొమ్మనఁగ • భవ్యమనోరథమున్ వచించి యుం
టి రఘుకులేశ్వరున్ విడిచి • నేను నిమేషమునైన నిల్వనే
ర రయముతో మఱల్పుము సు • గప్రతిభామలచిత్త! నామనో
హరుని మహాత్ముఁ జేర్పుము ప్ర • భాకరవంశసమున్నతుల్ రహిన్.

లక్ష్మ—అమ్మా! అట్లనకుము. వేగముగ మునీంద్రుల దర్శనమును గావించుకొని యయోధ్యకుఁ బోవచ్చును. (తనలో) అయ్యో! నాకెట్టి గతికలిగినది. మాతృసాన్నిధ్యంబున నన్పృతముకూడ నాడవలసివచ్చినది. ఈమెకు మోసముచేయ వలసినదనియే గదా రాజాజ్ఞ! నాయందేమి దోషముండును? పూర్ణగర్భవతిని విపినమున విడుచుటకంటె దోషముకలదా? ఏమిచేయుదును? భృత్యుఁడై మృష్టాన్నమును దినుటకంటె స్వతంత్రుఁడై గంజిమెతుకులను దినినమేలు.

సీత—సౌమిత్రీ! మనసున నేదియో యాందోళన కలుగుచున్నది. వేగముగ సాకేతపురికిఁ గొనిపొమ్ము.

లక్ష్మ—అట్లనే పోవచ్చును. మునిపల్లెలకుఁ గొనిపోయి వారలదర్శనంబుఁ గావించి రమ్మని యన్నగారి యాజ్ఞగదా, అమ్మా! నీకోరిక నెరవేర్పక తిరిగిపోయినచో నాయనకుఁ గోపమురాదా?

సీత—నేను బ్రతిమాలుకొనెదను, వలదు, ఇపుడు నాకు సంతోషములేదు. ఏదియో యాపత్సూచన మగపడుచున్నది, ఇంటియొద్ద వారెట్లుండిరో?

లక్ష్మ—(తనలో) తల్లీ! నీకుఁ దటస్థించిన యాపదనే గుర్తింపనేరవు. తక్కినవారలకుఁ దటస్థించెనని విచారించుచుంటివి. మున్ను రావణుఁడు కొనిపోయినప్పుడు మఱల శ్రీరాముఁ డెప్పుడయినను దీసికొనిపోవునను నాసయైనను గలదు ఇప్పుడట్టిదిలేదుగదా! శ్రీరాముఁడే బుద్ధిపూర్వకముగా విడిచినైచినచో నిఁక నాధారమెచ్చటనుండును? (తలవంచుకొని విచారించును.)

సీత—లక్ష్మణా! ఊఱకుంటివి ఎవరికైననేమయిన నపకారము జరిగియుండునా చెప్పవేమి? ఎప్పుడును నామాటలకు వెంటనే సదుత్తరం బిచ్చువాఁడవు నేఁడిట్లూఱకుంటివేమి?

లక్ష్మ—అమ్మా! అందఱును క్షేమముగనున్నారు. ఎవరికేవిధమైన యాపదయు లేదు, వేఱొక విషయము నాలోచించుచుండుటచేఁ బరధ్యానముగ నుంటిని లేనిచోఁ దల్లివగు నీమాటకు జవాబీయనా?

సీత—నీవెప్పుడును నామాట నతిక్రమింపవని యెఱుఁగుదును. ఈదినమున నేలనో
మనసున దిగులుపాటు గానిపించుచున్నది.

లక్ష్మ—వేఱేమియుఁ గాదు, ప్రయాణపు బడలికయైయుండును.

తే. గీ. గర్భభారమునఁ బ్రయాణ ♦ కాంక్షకలుగ
మానివాటికలకునేగ ♦ మనసుపడుచు
నరదమెక్కి దవ్వేగుట ♦ యబలకెందుఁ
దగదొనర్చి తట్టిదిధరా ♦ తనయనీవు.

ఉ. అంచున విశ్రమంబుగన ♦ నయ్యెమఱొండెడఁ గానరాను పో
లిం దగురీతి నుండెబతి ♦ లెంకలు భక్తిఁ జరించుచుందు రా
బందుగులందఱుక్షేమహిత ♦ భాగ్యములం దులఁదూఁగుచుండిరిం
కెందు వ్యతిక్రమంబుగన ♦ నించుకయుంగనరాదు మాతరో.

ఇట్టి సుఖకాలమున నీకేదిగులు పాటు ప్రయాణపుశ్రమచేఁ గాని వేఱొండు విధమున జనించియుండదు. కొంచెము సేపు విశ్రమింపుము.

సీత—అట్లనే చేసెదను. ఈ తమాలతరుచ్ఛాయనొకింతతడవు నిదురించెద. (నేలపయిఁ బరుండి వామభుజంబున నుపధానముగఁ జేసికొనును.)

లక్ష్మ—(తనలో) హా! యెంతపాపాత్ముఁడను? జగజ్జననియిట్లు కటికినేలపై
శయనించియున్నది.

చం. దశరథ రాజుకోడలు ప్ర ♦ దర్శిత విక్రముఁడైన రాము దే
విశతముఖామర స్తుత సు ♦ విస్ఫురదచ్ఛచరిత్ర సీత స
త్య శమదమాది సద్గుణస ♦ మంచిత పుష్పసమానగాత్రి క
ర్కశధరణీతలంబునఁ ♦ బ్రకామము నిద్రవహించె నయ్యయో!

తే. గీ. హంసతూలికాతల్పంబు ♦ లందుఁబయిని
శయనమందిననొచ్చు నీ ♦ సాధ్వి దేహ
మెట్లు శయనింపఁజాలెనో ♦ యిట్లు నేల
పయివిధివిధానమిదియౌను ♦ భామకెందు.

తేనిచో విశ్వవిశ్వంభరావిదిత విజ్ఞాన సంపన్నుఁడగు జనకమహారాజేంద్రునకు దత్త పుత్రికయు నయోనిజయుఁ దుష్ట రక్షోవధంబునకై ధరణినవతరించినదియు రావణాదిన క్తంచర శ్రేష్ఠులనడఁచిన శ్రీరాముధర్మపత్నియు హనుమత్సుగ్రీవ విభీషణాదివీర వరేణ్యపరిసేవితయు నగు నీమహాదేవి యిట్టి కటికినేలను శయనించుటయేమి! దైవ మా! నీవిధానమెంతయు నన్యాయమైనది. చలిచీమనైనను జంపఁదలంపని యీశరీ

మసాధ్వీకిట్టి పాట్లొకలిగింతువు? పాప మీమె కప్పుడే భావ్యాపత్సూచనలగుపడు చున్నవి. అవ్యాజవర్తనయగు నీమెకు భావిసూచనలెట్లు కాన్పించుచున్నవో? కట కటా! యీజనయిత్రి నీదయంకరాటవుల నెట్లు విడిచి పోఁగలను? రాజాజ్ఞయెంత యన్యాయమైనది? ఈతల్లికి నాయందెట్టి వాత్సల్యముకలదు? కన్నతల్లియైనా నిట్లు కాపాడునా?

సీ. భక్తితోఁ దరిఁజేరి ♦ వందనమొనరింప
వత్స! దీర్ఘాయువుఁ ♦ బడయుమనుచు
బరిచర్యకై రాఁగ ♦ వాత్సల్యమునుజూపి
పరితోషమును బొంది ♦ పంపుచుండు
వంతనొందినవేళఁ ♦ బదిలంబుగావచ్చి
సాంత్వనమొనరించు ♦ శ్రద్ధగతుల
నాయనా లక్ష్మణ ♦ పాయకు మమ్మంచు
నతివత్సలతఁజూపి ♦ యాదరించు.

తే. గీ. నట్టి యీతల్లి నీవన ♦ మందు విడచి
కఠినహృదయుఁడవై ప్రభు ♦ కార్యవిధము
దెలిపి పురికెట్లు పోనేర్తు ♦ నీతివిదులు
సీత నెటవీడితననేమి ♦ చెప్పనేర్తు.

కటా! దైవమాయ!

సీ. అన్నతోఁ బోయి మ ♦ హర్షి క్రతువుఁ గాచి
వైదేహు పురికేగి ♦ సాదరమున
నతఁడిచ్చునాతిథ్య ♦ మంగీకరించి స్వ
యంవరమండప ♦ మందుఁ జేరి
యన్న శ్రీరాముఁడు ♦ హర్షంబుతో విల్లు
విఱిచి ధాత్రీసుతఁ ♦ బెండ్లియాడ
నతిభక్తి వారి పా ♦ దాబ్జములకు మ్రొక్కి
యదియె మొదలుగ న ♦ య్యాలుమగల

తే. గీ. నిత్యమును సేవఁ లొనరించి ♦ నీతి మెఱయఁ
గష్టమును జెప్పఁ జందానఁ ♦ గాచుచుండి
మాతృపితృభక్తి దీపింప ♦ మహిని వెలసి
మాతనిటవీడి యెటుపోదు ♦ మఱలి పురికి.

ఒకవేళ దారుణచిత్తుఁడనై యిట్లుపోయినను సీతతో వనికేగి యొంటిగ వచ్చిన నన్నుఁ జూచి కౌసల్య సీతాదేవి యేమయినదని ప్రశ్నింప నేమి సమాధానముఁ జెప్పఁగలను చెప్పుటకును మానుటకును ఘోరారణ్య మధ్యంబున గర్భవతి యగుఁ బ్రసవోన్ముఖురాలునగు సాధ్వీమణిని విడిచిపోవుట యెట్లు ? పురుషుఁడనగుటవలన ధైర్యమును వహించి నేనాకిరాత కృత్యమును గావించిపోయినను భర్తృగర్హితయైన యీజగన్మాత జీవించునా ? "తల్లీ ! శ్రీరాముఁడు నిన్ను విసర్జించె"నని పిడుగువంటి వచనము నామెతో నెట్లు చెప్ప నేర్తును ? వినినవెంటనే యామె ప్రాణములు విడుచునుగదా హా మాలధైనమా ! మహావంశమునకెట్టి దావానలము నంటించితివి ?

ఉ. రాముఁడు వీడెనంచు విని ♦ ప్రాణము వీడు ధరాతనూజ యా
రాముఁడు నంతనష్టుఁడగు ♦ రాముఁ దలంచి సహోదరుల్ మహిం
బ్రాణములుంచ లేక విడు ♦ వం దలపోతురు తల్లులుండ రే
భూమిని సూర్యవంశము వి ♦ మోదముతోడ నశించు నైవదూ !

ఉ. జానకిగర్భమునం గనియె ♦ సంతతి నిల్చె యశంబు నచ్చె నీ
భానుకులంబు పూతమయెఁ ♦ బార్థివశేఖరులు ద్భవింతురి మా
కేను చిరస్థిరంబగు మ ♦ హా యశమంచుఁ దలంచి యుంటి మీ
శ్రీనిధి యా కులంబిటులఁ ♦ జేటువహించుట న్యాయమౌనొకో.

ఏమిచేయుదుము ? శ్రీరామచంద్రుఁ డారాత్రి రజకులయింటి నైపునకేల బోవలయును ? పోయెంబో వారి మాటల నేలవినవలె ? వినినను నిట్టి పిచ్చినిరణింబునట యుక్తమా ? మాయింటి మింతటితో నశించియే తీఱవలయును, లేనిచో నగ్నిసాక్షిగఁ గాంచిన పాతివ్రత్య మహిమఁగల ధారుణీతనూజయందు రామునకిట్టి యీర్ష్య పుట్టదు. (సీతను జూచుచు) నిర్మలంబగు నీమె ముఖారవింద మెట్లు ప్రకాశించుచున్నది ? (అనుమానించుచుఁ బరికించి) అయినను సర్వసర్వంసహాచక్రవర్తికిఁ బట్టమహిషియగు నీసాధ్వీముఖంబున విపత్తునకు సూచన లగపడుచున్నను జీవకళలు తఱుగుటలేదు. ఈమె నిద్రించుచున్నది. ఈమెను విడిచిపోవుట కిదియే యదను, (సీతను జేరింపి)

తే. గీ. సకలజగములఁ దాలిచి ♦ జఠరమందుఁ
బ్రళయకాలమున వెలుఁగు ♦ దివ్యశక్తి
కరణి నిండు గర్భముఁ దాల్చి ♦ క్రాలుచుండు
జానకిని గన్నవంతయా ♦ స్వాంతమందు.

ఇట్టితల్లిని ఘోరారణ్యమున విడిచిపోఁదలంచిన నాపాపమునకు విముక్తియుండదు.

ఒకదెస రాజాజ్ఞ తొందరచేయుచున్నది. రెండవదెస మాతృభక్తి వెనుకఁదీయుచున్నది. సీతకంటెఁగూడ రాముఁడు పూజ్యుఁడగుటవలన నేను నిశ్శంకతో రాజాజ్ఞను నెఱవేర్తునుగాక !

తే. గీ. తల్లి ! దీనుఁడైన సౌమిత్రి ♦ ధరణితనయ
నిన్ను విడిచిపోవుచుండె నే ♦ తెన్నులేని
యిట్టి వనమునందు రాజాజ్ఞ ♦ నించుకేని
శంకలేకుండ మన్నింపు ♦ సాధ్వి నన్ను.

(చేతులు దోయిలించుకొని) ఓ సమస్త దేవతలారా ! నా ప్రార్థనంబును వినుఁడు' ఈమె ధరాసుత. మిథిలేశ్వరుని కుమార్తె దశరథ మహారాజునకుఁ బెద్దకోడలు, శత్రు రాజ్యప్రదాతయు రావణాదినక్తంచరనిహంతయునగు శ్రీరామచంద్రుని ధర్మపత్ని. మహాపతివ్రత. కారణాంతరమున వచింపఁబడి రామచంద్రుఁ డీమెను బూర్ణగర్భవతిని విసర్జింపుమని నాకాజ్ఞ యిచ్చినాఁడు. నాకేమి చేయుటకును దోఁపక రాజాజ్ఞయే యనుసరణీయమని యెంచి యీమెను ఘోరారణ్యంబునఁ బరిత్యజించి పోవుచున్నాను. ఓ సర్వభూతములారా ! నదీనదపర్వత వనస్పతులారా ! ఈ మహాపతివ్రతను రక్షింపుఁడు.

ఉ. రాముఁడు దైత్యదానవవి ♦ రాముఁడునైన ధరాతనూజ యీ
భామిని సాధ్వియైనఁ జిత ♦ భవ్యచరిత్రుఁడునైన నేను స
ద్ధాములు వీరినెల్లప్పుడు ♦ భక్తి భజించుచునున్న దేవతల్.
ప్రేమను మంతోడ నీమెఁ గని ♦ పెట్టుచునుండుఁడు సర్వకాలమున్.

(నిష్క్రమించి మఱలఁ బరివేశించి) అయ్యో ! యీ రాఘవేశ్వరపట్ట మహిషి నెట్లు డించిపోఁగలను ?

చం. పులులు వృకంబు లుఁగలవు ♦ పోతరమందిన పందులుండు బొ
బ్బలిడెడి క్రూరజంతువులు ♦ బారులుగట్టి చరించుచుండు భూ
తలము శిలామయంబగును ♦ దర్భలు మెండు భయంబుఁగూర్చు సం
చలనము కల్గుఁ జిత్తమున ♦ సద్వరయోధులకైనఁ గానలన్.

అట్టి యీ తమోనిబిడంబగు మహా గహ్వరప్రదేశమున సరోజకోమలముఁ గాంచిన యొక్క సుందరీమణి నిగర్భభారాలసను విడిచిపోవుట న్యాయమా ? ఆ మహాదేవితోఁ జెప్పి పోవుటకు శక్యములేదు. చెప్పకపోయినచో నామె నే నేమయినదియుఁ దెలియక విచారించును. మహాఘోరకృత్యమును గావింప సిద్ధపడిన నాకిట్లు జాలిపు

ట్టుట న్యాయముకాదు. మనసుగట్టిపఱచుకొని యిదియే నిష్క్రమించెదఁగాక;
(నిష్క్రమించును.)

సీత—లక్ష్మణా! లక్ష్మణా! అయ్యో! నన్నుఁ గాపాడుము. (కలవరించును.)

లక్ష్మ—(తొందరతోఁ బ్రవేశించి తనలో) ఇదియేమి! యీమె యిట్లులఱచినది
ఈమె కేమయినను భయముకలిగినదా?

సీత—(మఱల నిద్రించును.)

లక్ష్మ—(తనలో) సీత యథాప్రకారముగ నిద్రించుచునేయున్నది. ఈమె నన్నుఁ బిలిచియేయుండదు. నామనోవిభ్రమమే యిట్లు తోపించుచున్నది కాఁబోలును? (ఒక భూర్జపత్రమును దీసికొని యందుపయి నేదియో లిఖించి యట విడిచి) ఇఁక ప్రయాణమును సాగించుకొనెదను. ఇక్కడ నెంతసేపున్న నేద్దియో యొకవిధమున విచారముకలుగుచునే యుండును. ఇప్పుడో యొక గడియకో యీ మహాదేవిని విడిచి పోవలసినదే. ఈమెకు మేలఁకువవచ్చిన పిమ్మట పోవుటకష్టము. సాహసముచేసి యిప్పుడే పోయెదనుగాక,
(సీత వెనఁదిరిగి చేతులు జోడించుకొని)

సీ. అమరవరేణ్యులా ♦ ర! మహితపర్ణను
లార! రక్షింపరే ♦ యవనిసుతను
సిద్ధులార! గరుడ ♦ వృద్ధులార! దయతో
రక్షింపరే మీరు ♦ రామసతిని
పాతాళవాస స ♦ త్ప్రభులార! ఘనులార!
కాపాడరే మీరు ♦ కమలనేత్రి
వనినాయకులార! ♦ యనఘులార! కరుణ
వెలయఁగఁ బ్రోవరే ♦ వెలఁదినీఁపె

తే. గీ. నడవి మెకములార! ♦ హరి హర్యక్షులార!
పర్వతనదీనదములార! ♦ వనములార!
కానదేవతలార! యీ ♦ కలుషరహిత
సీతఁ బ్రోవరే కానల ♦ చెంతఁ జేరి.

హాతల్లీ! నన్ను క్షమింపుము. ఇదే సాకేతపురికిఁ బోవుచున్నాఁడ. (నమస్కరించి నిష్క్రమించును.)

సీత—(మేల్కాంచి) ఏమిది? నాకింత నిద్రపట్టినది. (దిక్కులుచూచి) లక్ష్మణా! (జవాబులేకపోవుటవలన దిగులుతో లేచి నాలుగువైపులను జూచి) లక్ష్మణా! (బిగ్గఱగఁ బిలిచి యంతకును బలుకకపోవుటచేఁ గంగారుపడుచు) సౌమిత్రీ! యెక్కడనుంటివి? ఒంటిగ నన్ను విడిచిపోతివా? (విచారముతో) భీకరారణ్య ప్రదేశముల నీవిటుల నొంటిగఁ బోవచ్చునా? నీకేమి యాపద ఘటిల్లినదా? (పరిక్రమింపుచు) సౌమిత్రీ! (బిగ్గఱగఁ బలుకుచుఁ దనలో) అయ్యో! లక్ష్మణుఁ డెక్కడకో పోయినాఁడు. నేనిట నిద్రపోవుటఁ జూచి వాఁడెటకుఁ బోవును! లేచినపిమ్మట నేను జలము నడుగుదునని ముందుగనే తెచ్చుటకై పోయియుండునా? ఇదియే గోమతీనదియేగదా? ఈమెట్ల నెక్కి చూచెదను. (మెట్లెక్కిచూచి) అతఁడీవైపున లేఁడు. మఱి యెటకేగియుండును? ఫలములను దెచ్చుటకై పోయియుండునా? (మఱలఁజూచి) అట్లును బోయియుండఁడు. మఱి యెటకు జనియుండను? (మొదటి చోటికిబోయి) లక్ష్మణా! (బిగ్గఱగఁ బలుకుచు నచ్చోటనున్న చీటిని దీసి చదువుకొని) హా నాథా! నేనేమి పాపముఁ జేసితిని? (మూర్ఛవోయి కొంచెము సేపటికిఁ దెలివినంది) దైవమా! నాభర్త నన్ను విడిచి పెట్టుటకైయే యిటుపంపెనా? నాకోరిక నెఱవేర్తునని యీవనమున విడిచి పెట్టుటయేల? (చీటిని మఱలఁ దీసికొని బిగ్గఱగాఁ జదువును.) తల్లీ! దాసుఁడు లక్ష్మణుఁడు విన్నవించునది. నీనాథుఁడు శ్రీరాముఁడు రజకవచనములను నమ్మి నీపవిత్ర వర్తనమున సందేహము కలవాఁడై మునిపల్లెలను జూచుట కనునెపంబున నిటకుఁ గొనిపోయి విడిచిరమ్మని యాజ్ఞాపించెను. ప్రభువాక్య చోదితుఁడనగుచు విధేయుఁడనగు నేనా ఘోరకార్యమును గావించి యయోధ్యకుఁ బోవుచున్నాఁడను. ఇక్కడకు మిథిలానగరము సమీపమున నున్నది జాగ్రత్తతో నటకుఁ బోయి నీగర్భమందలి శిశువును రక్షించుకొనుము అబిడ్డవలనవే నీభావిజీవితమున సౌఖ్యము కలుగును గాక! సాహసకృత్యంబులకుఁ గడఁగకుము పితృసదృశుఁడగు నగ్రజుని వచనములను బరిపాలించి యయోధ్యకుఁ జని యాతనికీవార్తఁ దెలిపి వెంటనే వచ్చి నీసన్నిధినుండి నిన్ను సేవించుటకై ప్రయత్నించెదను. ఏమునిపల్లెకయినను బోయి సుఖప్రసవమును గాంచుము నిన్ని ఘోరాపదను ముంచిన నన్ను క్షమింపుము, వంశమంతరించునట్లు చేయకుము.

దాసుఁడు లక్ష్మణుఁడు.

(అని చదివి విచారమున మఱల మూర్ఛిల్లును.)

(ఆకసమున)

వాయుదేవా! జగజ్జనని మూర్ఛిల్లినది చందనతరువులనుండి బయలుదేరి వికసితకమల పరిశోభిత కాసారవారవారి పూరశీకరములను దాల్చెడి మలయపవనుని బంపి యామె కుపచారములు సేయింపుము ఆమెను సర్వవిఘ్నంబులఁ గాపాడవలయును.

దేవా! త్రిలోకాధిపతీ! నీయాజ్ఞమేరకట్లే చేసెదము. భర్తృవిరహితయైన యీసాధ్వి ప్రాణత్యాగమును జేసికొనునను సందేహము కలుగుచున్నది.

అగునందులకుఁ గూడఁ దగిన ప్రయత్నములను జేయుచున్నాను భూమ్యగ్ని యమవరుణు లను వారిని రక్షించుటకై నియమించుచున్నాను. నీవుకూడఁ గాపాడుచుండుము.

సందేహమా? జగజ్జననిని రక్షింపక విడుతుమా? లక్ష్మణుని ప్రార్థనము నుగూడ వింటిమికదా! మనమాయమ్మను దప్పక కాపాడవలయును.

సరియే నేను బోయెదను.

సీత—(తెప్పతిల్లి విచారముతో) ఆర్యపుత్రా! నాయందేమి దోషము కలదు! చాకలి యొకఁడు పలికినంతమాత్రమున గర్భవతినగు నన్ను విడిచితివా? ఇదివఱలో లంకయందు దేవతాసన్నిధిని నాపాతివ్రత్య పరీక్షయైనది కాదా? మఱల ననుమానమేల సంభవింపవలయును? నీవు బుద్ధిపూర్వకముగ విడిచినపిమ్మట సీత జీవించియుండునా? నాప్రవర్తనమున సందేహము జనించిన నీకు నావలన జనింపఁబోవు పుత్రులతోఁ బ్రయోజనముండదు. భ్రూణహత్యనుగూడ నంగీకరింతునుగాక ఆత్మహత్యను జేసికొను పాపాత్మురాలి కీ భ్రూణహత్యయంను వెఱపేలయుండును? నే నెవ్వరిని నిందింపనక్కఱలేదు. నావలన నేదోషమునులేదు. నాకర్మమే నాకీగతిఁ గలిగించినది. దైవమా! యిదే గోమతీజలంబులఁ బ్రవేశించి భూలోకజీవితమును బూర్తిచేసికొనెదను గాక, (పరిక్రమించుచు గోమతీనదియందుఁ బ్రవేశించును.)

(ఆకసమున సీతకు వినిపింపకుండ) వాయుదేవా! తొందరపడుము వరుణునిఁ బంపుము సీత నదిం బ్రవేశించుచున్నది మోఁకాటిలోఁతుకంటె నెక్కువ కాఁగూడదు.

సీత—(ఆశ్చర్యముతో నదియందుఁ బరిక్రమించుచు) ఇది యేమి చిత్రము? ఏనుగులు కూడఁ గ్రీడింపఁదగు నీగోమతి నేఁడు నాకు జానుదఘ్నయైనను గాలేదు. ఇందు నాకు మృతికలుగుట కష్టము (చూచి) ఈకనఁబడువృక్షము పెక్కు

శాఖలను గలిగి యధిరోహించుటకు వీలుగనున్నది దీనినెక్కి యటనుండి భూమిపయింబడి మరణించెదఁగాక! (నదినుండి యొడ్డునకు వచ్చి చెట్టెక్కును.)
(ఆకసమున) వసుధా! చూడుము సీతకు దెబ్బతగులకుండునట్లు చేయుము.
(సీత శాఖనుండి యుఱుకఁగా భూమి యామెకు గానిపింపకుండ నుండి సీత నుగ్రహించి నిరపాయినిగనుంచును.)

సీత—ఇది మఱియుఁ జిత్రముగానున్నది. ఈపర్యాయము తప్పక మృతికలుగును.
(ఒక పెద్దపులి యెదురుగాఁబోఁగా నదిభయముతో ముట్టెవేలపయి నుంచుకొని వినయముతోఁ దొలఁగిపోవును. సీత ఆశ్చర్యముతో) అరే! యిదేమిమాయ? ఎవరీకృత్యములను జేయుచున్నారు? నేను జచ్చిన నెవ్వరికేమి యాపదకలుగును? భర్తకుఁ గొఱగాని వనిత బ్రదికి యేమి ప్రయోజనము? (ఉఱివేసికొనును.)

(ఆకసమున) వాయుదేవా! చూడుము.

సీత—(ఉఱి పడకపోవుటవలన వెఱఁగంది) ఇఁక నెవ్వరును నన్నుఁ దప్పింపఁజాలరు అటనున్న కట్టెలను బోగుచేసి నిప్పంటించి యాయగ్ని కెదురుగా నిల్చి ఓ హవ్యవాహనా!

ఆ. వె. ధరణిజాతనైన ♦ తథ్యవచననైనఁ
బూతచరిత్రనైనఁ ♦ బొలఁతినైన
రామునందుభక్తి ♦ నామదినుండిన
దగ్ధమొనరుపుమయ ♦ దహన! నన్ను.

(చేతులు జోడించుకొనుచు రామనామస్మరణఁజేయుచు నందుఁ బ్రవేశింప నుద్యుక్తురాలై ప్రదక్షిణములు గావించుచుండును.)

వాల్మీకి—(ప్రవేశించి) సాధ్వీ! తొందరపడకుము నేనిదే వచ్చుచున్నాను నీకువచ్చిన యాపదలేదు.

సీత—(తొందరగా నగ్నియందుఁ బ్రవేశింపఁ బోవును.)

వాల్మీకి—(తోడనేవచ్చి) జ్వలనా! శాంతింపుము సాధ్వీ! ఏయీఘోరకృత్యమును మానుము నీయాపదనునాకుఁ జెప్పుము.

సీత—అయ్యా! నమస్కారము క్షమించి కొంచెము తొలఁగుఁడు నాయాపద తీఱినది.

వాల్మీకి—అమ్మా! నాకు నమస్కరించితివి చిరకాలము సౌభాగ్యవతివగుదువని దీవించుచున్నాను. గర్భవతివైన నీ వీసాహసము చేయరాదు. నీవెవరిదానవు?

సీత—అయ్యా! తమ యాశీర్వచనము నేఁడు ననృతమగును. ఈనిర్భాగ్యురాలి విషయమై యనుగ్రహింపకుడు.

వాల్మీకి—ఏమీ? నీయాపదను నేను దప్పింపఁజాలనా?

తే. గీ. సాధ్వి! బ్రహ్మప్రళయమైన • జరుగఁగాని
నావచనమనృతమగునె • నలిననేత్రి!
నీకు మృతిలేదిపుడు పతి • నిన్నుఁజేరి
సౌఖ్యమునను సుతుండుండె • జఠరమందు,

అట్టికుమారుని గూడ జంపెదవా? తొలుత నీవెవ్వతెవో చెప్పి నీయనిష్ట దశను విశదీకరింపుము.

సీత—అయ్యా! యిన్నివిధముల నడిగెడి మీకుఁ దెలుపకునికి మూర్ఖతయగును నేను జనకుని పుత్రికను.

వాల్మీ—(ఆశ్చర్య సంభ్రమములతో) తల్లీ! సీతా! నీవా? నీకే యిట్టి యనిష్టము వచ్చినదా? చెప్పుము ఇప్పుడే తొలగించెదను.

సీత—తండ్రీ! పతివ్రతకేది దుస్సహమో యదియే నాకుఁ దటస్థమైనది.

వాల్మీకి—నీభర్తకాపద సంభవించినది? దగ్గఱ వసిష్ఠుఁడు లేఁడా?

సీత—అట్టిదికాదు. రావణుఁడు నన్నుఁ జెఱగొని పోయెనని లోకులు నిందించిరని నన్ను నాప్రాణేశ్వరుఁడు విడిచివైచెను

వాల్మీకి—(తనలో) నేను రామాయణమున వ్రాసినట్లే యయినది, (ప్రకాశముగా) నీకు విచారమేల? భర్త మఱల నిన్నుఁ దీసికొనిపోవును.

సీత—అంతటి యదృష్టము నాకీజన్మమునఁ గలుగదు.

వాల్మీ—నేను గావించెదను. మాపల్లెకు వచ్చి మమ్మనుగ్రహింపుము.

సీత—అదియెట్లు కలుగును? అసంభవము.

వాల్మీ—నావచనమును వినుము ఆరాముడు! —

తే. గీ. అంబ నీకుమారుల కాజి • యందునోడి
యంతవాజిమేధమఖ • యాగమునకు

సిద్ధిలేక నిగ్గొనిపోయి ♦ వృద్ధిఁగలిగి
యేలుకొను నిన్ను మహిషిగా ♦ నిందువదన!

ఇందు సందేహములేదు. నాతోరమ్ము నావచనమన్యథా కాదు.

సీత—తమవాక్యబలమున నట్లే కావించెద. నన్ను రహస్యముగా రక్షింపుఁడు.

వాల్మీకి—మంచిది. (సీతతో నిష్క్రమింపఁగాఁ దెరవ్రాలును.)

ఇయ్యది శ్రీమదాత్రేయ విరచితంబగు నుత్తరరామచరిత నామక దృశ్యకావ్యంబున సీతాపరిత్యాగంబను నది ద్వితీయాంకము.



# ఉత్తర రామ చరితము.

## తృతీయాంకము.



రంగము:— వాల్మీక్యాశ్రమోపాంతప్రదేశము.

సంవర్తుఁడును వాల్మీకి శిష్యుఁడగు గౌతముఁడును బ్రవేశింతురు.

గౌతముఁడు— మునీంద్రా! ఆశ్రమము నొద్దకు వచ్చితిమి చాల నలసియున్నారు. మా యాశ్రమము పవిత్రమయినది.

సంవర్తుఁడు— వత్సా! నీవట్లన నక్కఱలేదు మహాత్ముఁడగు వాల్మీకి మహర్షి దర్శనమెట్లు కలుగును? శ్రీమద్రామాయణ గ్రంథకర్తయగు నాతనిని సందర్శించిన మాతపము ఫలించును.

గౌత— ఆర్యా! రామాయణమనిన జ్ఞాపకము వచ్చినది. ఇప్పటికి పది సంవత్సరములకుఁ బూర్వము మాగురువుగారి కీప్రాంతముల గర్భవతియగు నొక సుందరి కానిపించినదఁట ఆమె చిత్యారోహణముఁ గావించుచుండ మాగురువులు వారించి యాశ్రమమునకుఁ గొనివచ్చిరి ఆమెను జూచినచో రాజకాంతయను సంశయము కలుగుచున్నది.

సంవర్తు— ఎవ్వని భార్యయోకదా! ఏకారణమున మరణమందఁగోరెను.

గౌత— అదియంతయు నాకుఁ దెలియదు. భర్త విడిచిపెట్టెననియు నందునఁ జావఁబోయినదనియుఁ జెప్పినారు.

సంవర్తు— గర్భవతినే విడిచినాఁడా? దుర్మార్గుఁడు తర్వాత!

గౌత— ఆమె మాయాశ్రమమున నొక పర్ణకుటీరమున నొక బాలునిఁ బ్రసవించినది.

సంవ— భగవంతుఁ డనుగ్రహించినాఁడు.

గౌత— అప్పటికిని గర్భభారము తొలఁగనందున మా యాచార్యులవారు మంత్రించిన కుశోదకము నిచ్చిరి. అంత రెండవ కుమారుఁడు కూడ నుదయించినాఁడు.

సంవ—(ఆశ్చర్యముతో) కవలా! మగబిడ్డలగుటవలన నామె నెట్లయినఁ బోషింపఁ గలరు.

గౌత—ఆపిల్లలకు మా మునీంద్రులే జాతకర్మాది సంస్కారముల నొనరించి కుశోదకములవలన జన్మించినవానినిఁ గుశుఁడనియుఁ దొలుతఁ బుట్టినవానిని లవుఁడనియుఁ బిలుచుచుండిరి.

సంవ—కవలగుటవలన. కుశుఁడు జ్యేష్ఠుఁడయ్యెనా?

గౌత—సమస్త గుణములయందును గూడఁ జ్యేష్ఠుఁడే మిన్న వారికుపనయనముఁజేసిరి

సంవర్తుఁడు—అట్లనా! మీ మునీంద్రుఁడు సాధురక్షకుఁడు.

గౌత—దేవా! మా నింగతిఁ జెప్పుటకు హేతువును వినుఁడు ఆబాలురిరువురును. రామాయణమునంతను గంఠపాఠముచేసిరి.

సంవర్త—(ఆశ్చర్యముతో) ఆ! యేమి ప్రజ్ఞ! అంతటిబుద్ధిమంతులా.

గౌత—ఒక్క బుద్ధియేకాను. గాయత్ర్యుపదేశము కాఁగానే సమస్త దివ్యాస్త్రములయొక్క యధిదేవతలును వారికిఁ బ్రత్యక్షమై తలఁచినంత వచ్చి కార్యసాధనమును గావించి పోయెదమని చెప్పి యంతర్ధానమందుట వినిన మాకందఱకు వాండ్రెవరో దేవత లవతరించి రను సంశయముకలిగినది.

సంవ—బ్రహ్మర్షులు గాయత్రినుపదేశింప సమస్త మంత్రాధి దేవతలు కానిపించుట యాశ్చర్యమా! ఆబిడ్డలయందు వారికేలనో మిక్కుటమైన వాత్సల్యము కలిగినది మీగురువుల యనుగ్రహంబున వారు సమస్తవిద్యలను నేర్చుకొందురు.

గౌత—నేర్చుకొనియే యున్నారు. ఎందఱో మునులు వచ్చి వారిని మెచ్చుకొని పలకొకవరము నిచ్చుచున్నారు ఇన్నివరములు గ్రహించి వాండ్రెంత వారిలగుదురో తెలియకున్నది.

సంవ—కారణ జనితులగు దేవతలయి యుందురు నాకును వారిని జూడవలయునను కోరక పుట్టుచున్నది త్వరగఁ బోవుదము రమ్ము.

గౌత—(అటు నిటుఁ జూచి) మునీంద్రా! దూరమున నెవ్వరో సేనలను నిలిపియున్నారు చూడుఁడు ఎవ్వరై యుందురు.

సంవర్త—ఎవ్వఁడో రాజు పరివారముతో వేఁటకై వచ్చియుండి యాశ్రమంబగుటవలన సేననటు నిలిపియున్నాఁడు కొంత వడి కాశ్రమమునకు వచ్చును.

గౌత—(మఱలఁజూచి) మునీంద్రా! చూచితిరా! అదే యెవఁడో రాజును మంత్రియో మఱొకఁడో యనుచరుఁడును మనవైపునకే వచ్చుచున్నారు మనము ముందుగనే మునీంద్రులయొద్దకుఁ బోవుదము.

సంవ—మంచిది. (నిష్క్రమింతురు.)

ఇది విష్కంభము.

రంగము—వాల్మీక్యాశ్రమోపాంతప్రదేశము.

శత్రుఘ్నుఁడును సేనానాయకుఁడు విజయసేనుఁడును బ్రవేశింతురు.

విజయసేనుఁడు—మహాప్రభూ! శత్రుఘ్నరాజకుమార! ఇయ్యది యేప్రదేశమో తెలియుటలేదు. ఈవైపునకు వచ్చినదిమొదలు నాకేదియో సందేహమగుచున్నది.

శత్రు—విజయసేనా! నీకు సందేహమేమి? వివరించి చెప్పుము

విజయ—ఈప్రదేశ మెచ్చటిదో? నాకు దిగులు కలుగుచున్నది.

శత్రు—ఇది యొక మునిముఖ్యుని యాశ్రమ ప్రదేశమై యుండును ఆచిహ్నములు కాన్పించుచున్నవి. పులులును లేళులు నవియే యాడును. సహజశత్రుత్వమును మాని యొక కొలనియందే జలపానముఁ జేయుచున్నవి. ఆఁడు సింగములావు దూడలకుఁ బాలుగుడుపుచున్నవి. అత్యద్భుతముగ నున్నది. ఆగుంపు వైపునకుఁ జూడుము. సతతము మునులు హోమములు సేయుచుండఁగ వీతిహోత్రుఁడు వృద్ధినిఁ గాంచుచు నిట్టూర్పులు విడుచుచున్నాఁడో యనఁదోఁచు ధూమమాతోపునుండి కానిపించుచున్నది. కాషాయవస్త్రములు చెట్ల నారఁగట్టఁబడియున్నట్లు తోఁచుచున్నది.

విజయ—ఇయ్యది మున్యాశ్రమమనుటకు సందేహముండదు. అయినను నాకు దిగులు కలుగుటకు హేతువు తెలియుటలేదు.

శత్రు—మనకేదియో యనిష్టము రానైయున్నది అన్నగారీక్రతువు నేలఁ దలపెట్టిరో తెలియను అడుగుటకు వీలయినదికాదు.

విజయ—మహాప్రభూ! నేను గొంతఁ గర్ణాకర్ణిని వినియుంటిని విన్నవించెద.

శత్రు—(ఆత్రముతో) కొంతె నీకుఁ దెలియునా? చెప్పుము.

విజయ—మహారాజుగారు పంక్తికంఠునిఁ జంపి పిమ్మట నయోధ్యాధిపతులై మనలనెల్లరఁ బరిపాలించుచుండఁ గొందఱు దుర్మార్గులు రాజద్రోహులై జగన్మాతయగు సీతను దూషించిరి.

మ. అకటా! యేమని చెప్పనేర్తు రఘువం ♦ శాధారుఁడౌ రాముఁ డా
ర్య కదంబంబు నుతింపఁ జంపి యసురున్ ♦ రామామణిం బొంది వీ
టికి రా మూర్ఖులు నిందసేసి రతనిన్ ♦ శీవిన్ గ్రహించెన్ సతిన్
సకలంకన్ రిపుగేహవాసినిని భూ ♦ నాథుఁడటం చయ్యయో.

శత్రు—(విచారముతో) హాతల్లీ! సీతా! ఇపు డెక్కడనుంటివో కదా? జీవించియే యుంటివో లేదో? నీబిడ్డల విడిచిపోయితివే? తల్లీ!

విజయ—మహాప్రభూ! విచారింపకుఁడు కడచినదానికై వగవనేల?

శత్రు—(విచారముతో) మాతల్లి మమ్మెంత వాత్సల్యముతోఁ జూచునదియో నీకేమి తెలియును? నేను బ్రతిదినము నుదయమునఁ బాదాభివందనము నొనరింపఁ బోఁగా నామె 'నాయనా! శత్రుఘ్నకుమారా!' యని సంబోధించును. అట్టి పరమసాధ్వినిండు చూలాలు విపినమధ్యమందు విడువఁబడెను. హా! యింకేమిబ్రతుకు? (నిట్టూర్పు విడుచుచు నేలపయిఁ జదికిలఁబడును.)

విజయ—మహాప్రభూ? ఆశ్చర్యపడకుఁడు పిమ్మట శ్రీరామచంద్రుఁడు పూర్ణగర్భిణియగు సీతాదేవినిఁ బరిత్యజించెను.

శత్రు—ఓయీ! నాఁటి మాయిల్లు శోకదేవతకాలయమై యున్నదిసుమా. శ్రీరాముని పరితాపమునకు హద్దులేకపోయె ప్రజారంజనమునకై (నిట్టూర్పుతో) మాయమ్మను బరిత్యజించెను. లక్ష్మణుఁడామె నట్టడవిని విడిచి వచ్చినట్లు నాకును దెలియును.

విజయ—ఆ మహాదేవి సంగతి పిమ్మట నిశ్చయముగాఁ దెలియదు. దేవేంద్రుఁడు కృతజ్ఞుఁడై యామెను గొనిపోయి కాపాడుచుండెనని వదంతిపుట్టినది.

శత్రు—(ఆశతో) ఆయిన జీవించియేయున్నదా? సురలోకమునకుఁ బోయి చూచి వత్తమా?

విజయ—దేవా! అది యెంతవఱకు నిజమో! ఇక్కడి సంగతి వినుఁడు ఒకదినమున దుర్వాసుఁడు వచ్చి శ్రీరాముని బ్రహ్మహత్యాదోషము పోలేదనియు నందులకై యశ్వమేధమును గావింపుమనియు నాదేశించిపోయెను.

శా. దుర్వాసోముని పూజఁ గైకొనక ♦ సంతుష్టి న్విసర్జించి ని
ర్గర్వుండైన ప్రభూత్తముం దెగడి ర ♦ క్షోనిఘ్నదోషంబు లా
శర్వస్థాపనఁ దగ్గనయ్యెఁ గ్రతువున్ ♦ సద్వాజిమేధంబులే
నిర్వక్రింబుగ సల్పుమంచుఁ జనియెన్ ♦ స్వేచ్ఛాప్రకారంబుగన్.

శత్రు—పాడుమునులు వీండ్రే మాయగ్రజునిట్లు వేధించుచున్నారు. మనయాపదలయందొక మునియైన సాయపడునేమో చూడుము వసిష్ఠాదిగురువరులు తక్కఁ దక్కినవారు కొన్పింపరుగదా? సరియేఁ తర్వాత?

విజయ—ఆ రఘురాముఁడు సీతాదేవిని దలఁచుకొనుచు విచారించుచు దరిఁ గానలేక యున్నవాఁడు.

ఉ. ఆ రఘురాముఁ డంగన హృ ♦ దంతరమందుఁ దలంచుచున్ మనో
ధీరతఁ బాసి హాసతి! య ♦ ధీరవు నిన్వనిపాలు సేసితిన్

హా రమణీ! విదేహసుత! ♦ హా సుమకోమలి! సీత! యెందని

స్ఫారవిచారవార్ధిఁబడి ♦ ధన్యమెయుంగక యుండె భిన్నుఁడై.

అట్లాతఁడు పెక్కుభంగుల విచారించుచు వసిష్ఠునిఁ బిల్వఁబంపి యాయనతో నాలోచించి బంగరుసీతను జేయించి సన్నిధియందుంచుకొని మఖమును జరపనిశ్చయించి రాజమందిరంబున నున్న మిమ్ము రప్పించెను. తర్వాతి వృత్తాంతము దమరెఱిఁగియే యున్నారు గాన నీక్రతువొనర్పవలసివచ్చెను.

శత్రు—దుర్వాసుఁడు మాయన్న శ్రీమహావిష్ణువని యెఱిఁగినవాఁడే ఏల నిరీతి నిరూపించెనో యూహింపరాకున్నది మనకిదే నుపకారముఁ జేయఁగోరి యీ హవము నారంభింపఁజేయించెనా? అన్నిలోకములను జయించి చక్రవర్తియైన రావణునిఁ జంపిన మాయన్నకు రాజులెల్లరును సామంతులై యుండిరిక దా! ఇఁక గుఱ్ఱమును విడుమట యెందులకు? పోనిమ్మింతవఱ కెవ్వఁడైన దీనింబట్టెనా?

విజయ—సార్వభౌమత్వమును ధృవపఱచుకొనుటకే యిట్లు చేయుచున్నారని తలఁచెద ఈహయరాజమెన్నియో రాజ్యములను దిరిగినది ఇఁక వనములఁ బడినది. ఆశ్రమవాసులగు బ్రాహ్మణు లెవ్వరైన నాఁపివైతురేమో?

శత్రు—అయినఁ బ్రమాదమే (నిదానించి) మునులకు గుఱ్ఱములతోఁ బనియేమి! వారు దీనిజోలికి రానేరారు ప్రభుల ప్రతినలు వారి నాటంకము సేయవు.

విజయ—దేవా! వాస్తవమే మనయశ్వమటకుఁ జనినచో వారికి గందరగోళమగును. ఆ యల్లరులవలన వారు కినిసి శపింపఁగలరు.

శత్రు—(చూచి) విజయసేనా! యజ్ఞాశ్వమెటకోపోయినది చూచిరమ్ము.

విజయ—(నిష్క్రమించి వెంటనే ప్రవేశించి) అయోధ్యఁ బచ్చికమేయుచున్నది.

శత్రు—ఈ యశ్వమెంత ధన్యమైనదియో? యజ్ఞపశువునకుఁ బునర్జన్మము లేదఁట కొంచెము శ్రమకోర్చిన ముక్తిలభించును.

విజయ—దేవా! సర్వాశ్వయజ్ఞములను వధించిచంపునపుడు ప్రాణియెంతకొట్టుకొనునో? మరణబాధకు హద్దుకలదా? నిండుజీవమున్నట్లు హింసించి విలపింపఁ జేసిన బ్రాహ్మణులకేమి ప్రయోజనము కలదో?

తే. గీ. ఎల్లజీవులు సుఖమంద ♦ నిచ్ఛగించు
నందువొక ప్రాణిహింసించి ♦ యందవలయు
సుఖమనుచుఁ గోరఁగూడదు ♦ క్షోణియందు
నట్టియెడ మృగములఁజంప ♦ నగునె మనకు.

శత్రు——సర్వైశ్వర్య ప్రదుఁడగు యజ్ఞేశ్వరు నారాధించుటయే ఫలము. "జ్యోతిష్టో మేనస్వర్గకామో యజేత" స్వర్గమును గోరువాఁడు జ్యోతిష్టోమము చేయవల యును. ఈవిధముగా సకలక్రతువులకును వేర్వేఱు ఫలంబులు కలవు. అందున నే విప్రులు యజ్ఞములు చేయుచున్నారు.

విజయ——దేవా! మనప్రయోజనమునకై యితరులను హింసించుట తగునా?

శత్రు——తమకై యితరులను హింసించువారు రాక్షసులని ధర్మశాస్త్రములందు జె ప్పఁబడినది అయిన వాక్యాని హింసచేఁ జెప్పుదు సత్పురుషులు జీవింతురే ని నది హింసకాదని పరిహారము చెప్పఁబడినది.

విజయ——యజ్ఞములందట్టి కృత్యమున్నదియా?

శత్రు——లేకేమి? యాగములందుఁ జెప్పుదు దేవతలు హవిర్భాగములను బొందుదు రు. దేవతలు సాత్త్వికులనియు మానవులు రాజసులనియుఁ జెప్పెదరు అందున సత్త్వవంతులగు దేవతల సంతృప్తికై చేయు సత్రంబులయందుఁ బాపములేదు అట్టి వానర్చినవారికి స్వర్లోక ప్రాప్త్యాదిఫలంబులును గలుగును అదియుఁ గాక యందువలన సురలు ప్రీతులై వర్షములిత్తురు ఆవర్షజలంబున సస్యాదిక ము పెరిగి ధాన్యముల నొసంగును. వానివలన మన మాహారమును బొందిజీవిం చుచున్నాము యజ్ఞములు చేయనిచో నమరులు సంతృప్తిలేక వర్షమీయరు అనావృష్టిచే సస్యాదికములు నశించును. దాన జీవకోటులును నశించును. కావునఁ బ్రాజ్ఞుఁడగు నాతఁడు సర్వసిద్ధిప్రదంబగు యజ్ఞకార్యంబును సర్వవి ధములచేత నాచరింపవలయును.

విజయ——మహాప్రభూ! తాము సెలవిచ్చినదంతయు యుక్తమే కాని జీవహింసచే యుటకు మనస్సొప్పదు.

సీ. దేవతలు కలరో ♦ దివ్యలోక మొకటి
యున్నదో తెలియదో ♦ మర్త్యయందు
హుతమైన హవ్యంపు ♦ వితమెద్దియో వేమి
యౌనో తెలియరాదు ♦ హవములందు
మరణించిన మనుజ ♦ వరులేమి యగుదురో
వారలగతియేమొ ♦ వలనుపడదు
పుత్రులెవ్వరో ప్రాణ ♦ మిత్రులెవ్వరో కాంత
యెవతెయో తెలియలే ♦ మింతమైన

# తృతీయాంకము.

తే. గీ. నిట్టియజ్ఞానవారిధి ♦ నట్టనడుమ
మునిఁగియుండిన మనమేడ ? ♦ ప్రోజ్జ్వలతర
విజ్ఞతాగుణమేడ ? జీ ♦ విగణహింస
యనునదేడ ! యేడ సుఖంబు ♦ లందు బాస

ఏవిషయము నిదమిత్థమని చెప్పవలను గాని యిట్టి కృత్యంబులయందుఁ బ్రత్యక్షమం దుఁ గాన్పించు జీవహింస యొనర్పఁదగునా ? అంతియుగాక సూర్యుని కిరణజాలము లవేడిమికి భూమియందలిజలమావిరియై యాకసమున కెగసి యట శీతలవాయుసం స్పర్శనంబున భారమంది యాకసంబున నిలుపఁజాలక వర్షరూపమున ధరణిపైఁబడు నని యాదిత్యు నారాధించువారలు పలుకుదురు కావున నాసంశయంబులు రెండును విడఁ దీయుఁడు.

శతు్రి — నిప్ప్రశ్నకు నకుఁ బ్రత్యుత్తరము వినుము. ధాత్రియందెన్నియో జీవజాతు లు కలవు ఒక్కొక్క జాతికంటే వేఱొకటి కొన్నియధికారములను గలిగి యుండును అట్లే పిపీలికాదులకంటెఁ గ్రిమికీటకాదులను వానికంటెఁ బశు పక్ష్యాదులను వానికంటె మానవులును వారలకంటె దేవతలు నుత్తరోత్తరాధి క్యతను బొందియున్నారు అందు జ్ఞానముగల మానవులును బృందారకులు నన్యోన్య సహాయము ననుభవించుచున్నారు. ఈవిషయమైయే యిదివఱలోఁ జెప్పియుంటిని.

చ. మనుజులు చేయు జన్నముల ♦ మాన్యతరంబగు హవ్యముఁ సురల్
గొని ముదమందివారలకుఁ ♦ గోరికమిహాత్తిల వృష్టినిత్తు ర
య్యని మిషవత్తివృష్టినిల ♦ యందున సస్యములుద్భవించి పెం
పునుగని పంటలిచ్చుజన ♦ ముల్ సుఖియించుచు దత్ఫలాప్తిచేన్

గీ. ఒకని యుపకారమునకన్నె ♦ యురవడించి
పెక్కర కపకృతియొనర్పు ♦ విధము తెగదు
ఒకనినష్టమునను బెక్కు ♦ లుర్వియందు
సౌఖ్యమందగన నప్పని ♦ సలుపవచ్చు.

ఈక్రతువులందన్నన్నో యొకటి రెండు పశువుల హింసవలన సురలకు హవిర్భాగంబు లును వారల ప్రీతియు ధాత్రీతలంబున వృష్టియు దాన నఖిలజనాధారంబగు సస్యవృ ద్ధియు ఫలప్రాప్తియు లభించును కావున నట్టి కృత్యములు తప్పక చేయవలసినవి యే. ఒక్క ప్రాణిని హింసించుటవలనఁ గల్గుదోషము పదివేవురు ప్రాణులకు

సంతృప్తిగ భోజనమిడి దక్షిణలొసఁగిన శమించునని పూజ్యులు పలికెదరు అవ్విధా
నము వేదవిహితకర్మాచరణమునందు మాత్రమే సమ్మతింపఁబడినది అందులోభించిన
దోషముతప్పదు, కావుననే యజ్ఞములొనర్చువారు విశేషముగ నన్నదానముఁ జేతురు
అందునకు విప్రులు మెండుగ రావలయును కాననే "అనాహూతో ధ్వరంగచ్ఛేదా
హూతశ్శుభకర్మణి" అని స్మృతికర్తలు ఘోషించినారు శుభకార్యములకుఁ బిలు
పులేనిదే పోరాదు పోయిన నవమానము తప్పదు క్రతువుల కనాహూతుఁడైయైనను
బోవలయును బ్రాహ్మణులు సాత్వికులు సాత్వికతృప్తియే పాపనాశనమొనర్చును

మ. గొనముల్మూఁడిట వన్నెఁగాంచి కడు న ♦ క్షోభ్యంబునౌ సాత్వికం
బును గీర్తింతురు సాత్వికుల్ ద్విజులు శ్రీ ♦ మూర్తుల్ గుణాంభోనిధుల్
తనియంజేసిన వారలన్ భువనముల్ ♦ సంతృప్తిఁ గాంచుక్ సదా
మునివర్యుల్ వినిపింతురందునసెసం ♦ తుష్టిక్ ద్విజశ్రేణికిన్.

ఈపై కారణంబులవలన నధ్వరంబుల జీవహింసవలని దోషములేదు ఇఁక వృష్టి సూ
ర్యునివలన వచ్చుచున్నదనుటకు హేతువు వినుము హవిర్భుజుల సంతృప్తి ననుసరించి
వారల ప్రభుఁడగు సురేంద్రుఁడు తత్కారకులగు ప్రజలుండు ప్రదేశమున వర్షము
కురియునట్లు కట్టడి చేయును లేనిచోఁ గొండలయందో సంద్రంబులందో చవిటి
పఱ్ఱలయందో కురిపించును సూర్యుఁడు కూడ దేవతాగ్రణులలోని వాఁడగుటచే శత
క్రతుని యాజ్ఞ నతిక్రమింపఁడు అట్లయ్యె యజ్ఞములావశ్యకంబులుకదా? ఏయేఫల
ముల నుద్దేశించి క్రతువులొనర్తురో వారి కాయా ఫలంబులు సిద్ధించును నిష్కాములై
చేసినచో విముక్తిలభించును.

విజయ—నిష్కామ యజ్ఞంబులుఁ గూడఁ గలవా ?

శత్రు—లేకేమి? క్రతువులు పెక్కు తెఱఁగులుగా నున్నవి అందుఁగొన్ని యాత్మ
యజ్ఞములు కలవు వానికై పశువులు వేఱుగానుండవు కామక్రోధాదులే ప
శువులు ఆత్మయే యజమానుఁడు బుద్ధియే యధ్వర్యుఁడు ఇంద్రియములే ఋత్వి
క్కులు ధ్యాననిష్ఠయే హోమకుండమందలి యగ్నిహోత్రుఁడు ఇంద్రియార్థ
ములగు విషయంబులే హోమద్రవ్యంబులు మనస్సే యాజ్యము పునరావృత్తి
రహితశాశ్వత బ్రహ్మలోక ప్రాప్తియె ప్రయోజనము ఇట్టి యజ్ఞములను
విరాగులగు వారలు కావింతురు.

విజయ—దేవా! ఆయాగములే యుచితములు ఎల్లరును నవియే చేయుట మంచిది
నాకు నదియే యిష్టము మనరాజ్యమున నట్టి మఖములు జరుగునేర్పాటులు
చేయింపుఁడు,

శత్రు—ఓయీ! జ్ఞానులు కాఁబోవు వారుచేయునవి యవి చిత్తశుద్ధిగలవారు గాని జ్ఞానులగుట కర్హులు కారు ఆచిత్తశుద్ధి వేదవిహిత కర్మాచరణమునఁగాని లభింపదు కావునఁ జిత్తశాంతి కలుగువఱకు వేదవిహిత కర్మలొనర్పవలయును.

విజయ—దేవా! తమప్రత్యుత్తరములు నాకుఁ దృప్తి నొదవించినవి ఈసవనాశ్వము వెంట మనము సంవత్సరముకదా పోవలసినది? అప్పుడే పూర్తియైనట్లున్నదే?

శత్రు—కొంచెముగదా శేషమున్నది దైవానుగ్రహమున నదియు సమాప్తమైనచో యజ్ఞముఁ బ్రారంభింతురు.

విజయ—అందునకయియే మనము ప్రయత్నించుచుంటిమికదా! దైవాయత్తమెట్లట్లు జరగును.

శత్రు—ఇఁక రాజ్యములు విడిచినది భయములేదు వనములందవిశత్రువుల నెదుర్కొనుట కష్టముకాదు మునులైననో నాశ్రయింపవచ్చును.

విజయ—పూర్వము దిలీపమహారాజు హయమేధమొనర్చుచుండఁగా దేవేంద్రుఁడు గుఱ్ఱమును దొంగిలించెనఁట సగరచక్రవర్తి చేసినప్పుడు నట్లేచేసెను. ఆతఁడు మనకుఁ గూడ నపకృతి చేయకపోవునా?

శత్రు—శ్రీరామునివలనఁ బ్రాప్తరాజ్యుఁడగుటవలన భయములేదు ఆవాజిమేధంబులు నూఱును సంపూర్తియైనఁగదా యాతని భయమునకునికలేదు అయినను శ్రీరాముఁ డిచ్చిన రాజ్యమునుగాదే యాతఁడిప్పుడు పాలించుచుండుట.

విజయ—ప్రభూ! అట్లయిన నీయశ్వమునే యనుసరించి గడువుకాలము పూర్తిచేసికొనిపోవుదము. (చూచి) అదే యశ్వమట్లు పోవుచున్నది రండనుసరింతము.

శత్రు—మనసేనలుకూడఁ బోవుచున్నవి మనముకూడ నరుగుదము రమ్ము (నిష్క్రమింతురు) (తెరవ్రాలును.)

ద్వితీయరంగము వాల్మీక్యాశ్రమము.

(చూతవనమునందు లేమామిడిగున్నలకు జలముపోయుచు శాలంకాయనుఁడు, గౌతముఁడు, జైమిని, భార్గవుఁడు మొదలగు మునికుమారులును ధనుర్బాణతూణీరధారులగు లవకుశులను సీతాపుత్రులును ప్రవేశింతురు.)

శాలంకాయనుఁడు—ఓరిగౌతమా! నీవెన్నిచెట్లకు నీరుపోసినావురా?

గౌతముఁడు—ఆవరుస తడిపితిని నీవో?

శాలం—నేనిప్పటి కిరువదిమొక్కలకుఁ బోసితిని (లవునితో) లవా! నీవో?

లవుఁడు—(మందహాసముతో) నేను లవుఁడను ఏమిచేయగలను?

జైమిని—అట్లనా? మాటలయందు నీవు గురుఁడవే.

గౌత—మఱి పోటులయందో?

జైమిని—అందన్నదమ్ములిరువురును సమానులే.

లవు—మీకు మాటలయందు మాత్రమే సమర్థులు కాఁబోలును.

భార్గవుఁడు—గురువరుల యనుగ్రహ మున్నలోటేమి? అదియు లభించును అయితే లవా! మీదేయూరు? ఎన్నియోదినములనుండి యడుగవలయునను కొనుచున్నాను.

లవు—ఈ యాశ్రమమే మా నివాసము.

జాబాలి—మీతండ్రిపేరు?

లవు—మాకుఁదెలియదు.

జైమిని—తల్లియో?

లవు—సీతయందురు.

గౌత—వాల్మీకితాత రామాయణములో వ్రాసినసీతయా?

లవు—కౌను.

గౌత—మీ తాతగారిపేరేమి?

లవు—వాల్మీకి.

జాబాలి—గురువుగారినిఁ దాతగారనుచున్నావా? నీకుఁ జనువేమివచ్చును. గురువును బరిహసింతువా? ఛీ మూర్ఖుఁడా!

లవు—(కొంచెముకోపముతో) నీవు మూర్ఖుఁడవు వాల్మీకిమహాముని మాకు గురువు మాకుఁ దాతయు గురువునగును మాయమ్మ యాతనినెప్పుడును నాయనా! యని పిలుచుచుండును. ఆయన మాతల్లిని అమ్మా! యని సంబోధించును అతఁడు మాయంబకుఁ దండ్రి.

గౌత—అటులనా? అయినచో మీతండ్రి తెలియఁగవా! ఇన్నియేఁడులు వచ్చినవి. ఇన్నిమాటలు చెప్పుచున్నావు.

కుశుఁడు—ఎన్నియో పర్యాయములు మాతల్లి నడిగితిమి తాతనడుగుమని యామె చెప్పుచుండును.

జైమిని—పోనిమ్ము మునీంద్రుల నడుగరాదా?

లవు—అవకాశము లభించుటలేదు ఎప్పుడైనను లభించెనా యప్పుడప్పుడడుగుచుంటిమి అందుకు కాతఁడు మీతండ్రి గొప్పవాఁడు ఈతావునకే వచ్చి మిమ్ముఁజూ

మాయమ్మను దీసికొనిపోవుచు. కొన్ని కారణములవలన నచ్చోటనుండి వెడలి వాఁడు అతని పేరు మాకిప్పుడు చెప్పరాదనుచుండును అందువలన మాకుఁ దెలియదు.

గౌత—మంచిది మీరింత కాలమునుండి యిక్కడనే జరుపుకొనుచున్నారు.

కుశు—అయిదవయేఁట మాతాత మాకక్షరాభ్యాసముఁ జేయించి విద్యలు నేర్పెను.

జైమి—(సందేహముతో) అయిదవయేటనే విద్యలు చెప్పెనా ?

లవు—(గర్వముతో) అవును. పరీక్షింతువా ?

జైమి—సందేహముగనే యున్నది అడిగెద నేయే విద్యలు నేర్చినారు ?

లవు—నీకుఁ దెలిసిన విద్యయం దడుగుము.

జైమి—నీకస్త్రవిద్య తెలియునా ?

లవు—(గర్వముతో) అడుగుమని చెప్పలేదా ? ఏయస్త్రమును జూపుమందువు?

గౌత—ఆగ్నేయాస్త్రముయొక్క వివరము దెలుపుము.

లవు—(ధ్యానమునటింపఁగాఁ దెరలోఁ బిడుగుల ధ్వనులును జ్వాలలును గాన్పించును.) అదియే చూడు మాగ్నేయాస్త్రము.

శాలం—(చూచి) లవకుశ కుమారులారా ! సంతసించితిమి. మీకస్త్రములన్నియుఁ దెలియును బ్రహ్మాస్త్రమెట్టిది ?

కుశు—ఇట్టిదని నిర్ధారణఁ జేయఁజాలము అది ప్రయోగించిన బ్రహ్మయైనను జచ్చిపోవును ఆయస్త్రములన్నియు మాకు వాల్మీకియక్షరాభ్యాసము చేయఁగానే ప్రత్యక్షమయినవి సర్వదా మాతోఁ గూడనుండును.

జైమి—లవా! నీయందభిలాషకలిగినది. ఏదేని వరముఁగోరుమిచ్చెదను.

లవు—(నిరసముతో) విద్యార్థివి నీవేమీయఁగలవు. అదియుంగాక క్షత్రియులము. మేము ప్రతిగ్రహింతుమా ?

శాలం—ఓయీవటువా! నీకుఁ దెలియదు మునీంద్రులు వరములిచ్చునెడ స్వీకరింపవలయును లేనిచో వారు కోపించిశపింతురు. ఈయనయొకమహాముని, రామాయణనాయకుఁడగు శ్రీరామచంద్రునిఁ జూడఁగోరి యిటకు వచ్చి వాల్మీకి రామాయణమును జదువుచున్నాఁడు ఈతఁడు కేవలమును విద్యార్థి కాఁడు.

కుశు—మునీంద్రా ! మాసోదరుని తప్పు మన్నించి యనుగ్రహింపుము మాతండ్రినిఁ జూడఁగోరెదము.

జైమి—(లవునితో) నీయభిలాషయేమి ?

జాబాలి—లవా ! నామాట వినుము చిన్నతనంపుఁ బెంకితనము విడువుము.

తే. గీ. ఈమునీంద్రుఁడు జైమిని • హృష్టమతిని
నీకు వరమిత్తునని పల్కె • నీతి మెఱయ
నతనినుండి వరముఁ గొమ్ము • యనఘుఁడతఁడు
రామకథ నేర్చుకొనవచ్చె • రాజపుత్రి!

లవు—(వినయముతో) మునీంద్రా! నాయజ్ఞానమును హరించి మాయన్న కోరినదియే సఫలముఁ గావింపుము ఎన్ని దినములనుండియో జనకుని సందర్శించు నభిలాషకలదు అనుగ్రహింపుము.

జైమిని—(దివ్యదృష్టింజూచి యాశ్చర్యముతోఁ దనలో) ఔరా! యేమి యీవింత! ఈబాలుర శ్రీరామపుత్రులా? వాల్మీకి యెంతరహస్యముగఁ బెంచుచున్నాఁడు అందుననే వీరలకు సర్వాస్త్రములును లభించినవి బ్రహ్మర్షియగు వాల్మీకి వీరలకయిదవ వత్సరముననే సమస్త విద్యలను ప్రసాదించెను. శీఘ్రముగఁబోయి మహాపతివ్రతయు జగన్మాతయు వీరలకు జనయిత్రియగు సీతామహాదేవి యొక్క చరణకమలములకు నమస్కరింపవలయును శ్రీరామసందర్శన భాగ్యముకూడ ననతికాలమున లభించును (ప్రకటముగా) రాజపుత్రులారా! కొలఁది దినములలో మీతండ్రినిఁ జూడఁగలరు. మీతల్లియొక మహాపతివ్రత మీజనకుఁడిచ్చోటికేవచ్చి మిమ్ములను గొనిపోవును వాల్మీకి మీకు మాతామహుఁడుకాఁడు కొన్ని కారణములచే మీజనయిత్రినిఁ గాపాడిన యుదారస్వభావుఁడు. అందుననామె యాతనినిఁ దండ్రియని పిల్చుచున్నది, మున్ముందు సర్వమును మీకే తెలియును.

శాంల—లవకుశ కుమారులారా! మీయెడ జైమిని మునీంద్రుఁడు కరుణాళుండైయున్నాఁడు మీరదృష్టవంతులు

జైమి—నా రామాయణ పారాయణ సమయమగుచున్నది నేనుబోయి వచ్చెదను. మీరు తక్కిన చెట్లకు నీళ్ళుపోసి యాశ్రమములోనికి రండు అంతవఱకు నేను గురువుగారియొద్దనే యుందును.

గౌత—మంచిది, మే మీపనిని జేయుదుము లవా! నీవాబిందెతో నీటినిఁ దెమ్ము.

జాబా.—ఓయీ గౌతమా! నీకు మతిపోయినదా? గురువుగారి యాజ్ఞ యేమి? వీరిచే నేపనియుఁ జేయింపవలదనికదా ఇంతలోనే మఱచితివా? బాగుగనే మాటతప్పను.

గౌత—ఆయనకు వీరియందు మనకు బక్షమేల? మనతోఁబాటు వీండ్రుమాత్రము తేలవ

డా? వీరికిఁ గొమ్ములు మొలిచినవా? వారును దేనలయును లేనిచో నేను దీసి కొనిరాను.

**లవు**—గౌతమా! ఎవ్వరమును దేనక్కఱలేదు కొంచెము తడవు మీ యాశ్రమములోనికిఁ బోండు తోఁటయంతయు నీటితో నింపివచ్చెదను.

**కాలం**—ఏమిచేయుదువు?

భార్గ—వారుణాస్త్రమును బ్రయోగింతువా? అది మంచిపనియే మనుష్యులనందఱను బ్రదికింతువు కానిమ్ము మేముకూడఁ జూతుము.

**లవు**—(ధ్యానమునటింపఁగా మెఱుపులతోను బిడుగులతోను గొప్పవర్షము కురియును ఆశ్రమమంతయుఁ దడియును.)

గౌత—లవకుమారా! మిక్కిలి సంతోషమయ్యె నీవు సుఖపడితివి మనుష్యులను సుఖపెట్టితివి నీవంటివాఁడు తప్పక ప్రభువు కావలయును నీ వేప్రభుపుత్రుఁడవో కాని నీ తేజస్సుఁజూచి సూర్యపుత్రుఁడవని తోఁచుచున్నది.

**కాలం**—గౌతమా! అందువలననే యీపిల్లలకుఁ బనిచెప్పవద్దని గురువుగా రాజ్ఞాపించియున్నారు గురువచనమింతవఱకు నిర్వహించితివి.

(తెరలో) గౌతమా! ఈ యకాలవృష్టికిఁ గారణమేమి? ఏమనాచారమిచ్చట జరిగినది గురువులు కోపపడుచున్నారు.

గౌత—అయ్యా! విష్ణుదాసా! లవకుమారుఁడు వారుణాస్త్రమును మాకుఁ జూపినాఁడు దానవర్షముకురిసినది గురువులతో మనవిచేయుము అనాచారము జరగలేదని విన్నవింపుము.

(తెరలో) మంచిది అట్లనేపోవుచున్నాను కొంచెము సేపటిలో మీరును రండు నేఁడు గురువుల కెవ్వియో యానందభయోత్పాత సూచనలగుపడుచున్నవఁట చెప్పినారు మీరు వేగరండు నిరు పోయనక్కఱలేదుగదా మీకై కనిపెట్టుకొని యుందుము.

**కాలం**—లవకుశులార! మీరియువురును దివ్యాస్త్రవిద్యులై యున్నారు మీజనకుఁడున నన్యసామాన్య తేజోవిరాజితుఁడై యుండును సార్వభౌముఁడగు నాతఁడు నాతిచిరకాలంబున వచ్చి మిమ్ముఁగొనిపోయి పట్టభద్రులను జేయును అప్పుడు మేము స్మర్తవ్యులమగుదుమా?

కుశు—కాఁజాలరు ఏలనందురేనిఁ జెప్పెదవినుఁడు మేమట్టి యదృష్టవంతులమేయైన మీరలాదేశస్థులై యుందురు అందున మీరే మమ్ము సర్వకాలము కనిపెట్ట వలసి యుందురు మాజీవితములే మీహస్తగతములై యుండును.

గౌత—మఱియు సంతోషము ఈమధుకబళభోజనము తప్పి పోయిన షడ్రసోపేతము
గ దధ్యాజ్యంబులతో ముసుఁగుచు మీపేరుఁ జెప్పుకొనుచు మిమ్మాశీర్వదించు
చు భుజించుచుందుము,

లవు—(చిఱునవ్వుతో) సౌందర్యమునఁ దులలేని కన్యకలను దెచ్చి మీకు వివాహ
ముఁ జేయించి రౌంటికంబంపు మేడల నిర్మించి వెల్తురు నిచ్చుటకై సూర్యచం
ద్ర నక్షత్రముల నింటియందుంతును.

గౌత—(చంకలు కొట్టుకొనుచు) ఓ. ఓ, భేష్, భేష్, ఓ, అయితే అప్పుడు మీరు
మాకుఁ గాన్పించుదురా ? ఇదే వాగ్దానమా ?

శాలం—ఓరీ! పిచ్చివాఁడా ! నిన్ను లవుఁడు వేళాకోళము చేయుచున్నాఁడురా ?

గౌత—లవుఁడాడి తప్పునా ? పోనీ ! తప్పనీ! మనమామూలు స్థితికి భంగము లేదు
కదా మన బ్రాహ్మణార్థపు భోజనములకు లోటా ?

శాలం—లవుఁడను పదమున లవత్వము లేదా ? తర్క వ్యాకరణములు చదివిన నీకీ తెలి
వితేటలు యుక్తముగనే యున్నవి.

కుశు—శాలంకాయనా ! మీకేమియు సందేహము లేదు మాసోదరుఁడు పల్కిన పల్కు
లన్నియు వాస్తవము లేయగును కాని మీరనినవి కావలదా ?

జాబా—జైమినిముని చెప్పినాఁడు అదియుంగాక గురువుగారు మిమ్ముల నసమాన
వాత్సల్యంబునఁ జూచుచున్నారు ఈరెండు సుదార్కాణములు కావా ? సం
దేహము లేదు మీరు ప్రభువులగుదురు.

గౌత—(దిక్కులు చూచి) అదేదియో గుఱ్ఱము ? చూడుఁడు, ఎంతయందముగనున్న
దో ? లవకుమారా !

సీ. పంచవర్ణములఁ బ్ర ♦ భల నినుమండెడి
సుందరపటుకాయ ♦ శోభతనర
సుందరముఖసీమ ♦ సూనృతవచనుని
మోమునవలెఁ గాంతి ♦ పొలయుచుండ
సర్వసదావర్త ♦ సహితమా నెమ్మేన
నవయవసక్రిమ ♦ మలయుచుండఁ
బొడుగులై పటువులై ♦ పొలుపుఁ గాంచెడికాళ్ళు
పసువునందలికీర్తి ♦ వ్యాప్తిఁ జేయ

తే. గీ. సర్వలోకాధిరాజ్య ప్రశస్తలక్ష్మి
స్వారి చేయుట కర్హమై సాటిలేక
తిరుగుచున్నదీ యశ్వంబు దీనియందు
వాంఛ పుట్టెనె జనివేగఁ బట్టితెమ్ము.

అది నీకు లభించిన యుక్తము గానుండును దాని ముఖమున వీరతాండవ మాడుచున్నది.

కుశ—ఇంద్రుని యుచ్చైశ్శ్రవమేమో యని సంశయము కలుగుచున్నది కాని, దాని వర్ణము ధవళమని వర్ణింపఁబడుచున్నది ఇట్టి గొప్పయశ్వము వేఱొండెడ నుండఁదగదు.

లవ—భూలోక దేవేంద్రుఁడును సీతానాథుఁడునగు శ్రీరాముని దేమో ?

గౌత—కావచ్చును; ఆయనకొఱకై దేవేంద్రుఁ డిచ్చియుండవలయును లేదా బ్రహ్మ ప్రత్యేకముగా సృజించి యిచ్చియుండవలయును లేనిచో నరులకిట్టి హయరాజము నారోహించుశక్తి యుండవలదా? దినమున కెన్నియో వేలయోజనములు పరుగిడుశక్తిఁ గలిగియున్నట్లు కనఁబడుచున్నది లవకుమారా! దానిని నీవు పట్టుకొని స్వాధీనపఱచుకొనఁగలవా? అశ్వారోహణము నీకుఁ దెలియునా ?

కుశ—గౌతమా! తాతగారిదయవలన మాకన్నియుఁ దెలిసినవి ఎట్టిమోటుగుఱ్ఱమైన మాచేయి తగిలినమాత్రమునఁ బరమసాధువగును నీవును నేర్చుకొనియుంటివా!

గౌత—లేదు నేర్చుకొనవలెనని యున్నది నేర్పెదరా ?

కాలం—(నవ్వుచు) ఇటువంటి గుఱ్ఱముమీఁదనా నేర్చుకొనుట? ప్రమాదము కలుగును విశ్వామిత్ర సృష్టియందలి యశ్వములు కలవు అవి మిక్కిలి సాధువులు వాని నారోహించి క్రమముగా నిట్టివాని నారోహించుటయందునైపుణ్యమును బొందవచ్చును.

గౌత—(సంతోషముతో) ఓ! యింతకంటెనా? తప్పక నేర్చుకొందును లవకుశులారా! మీరు నన్నుఁ బట్టుకొని యాగుఱ్ఱ మెక్కింపుఁడు.

కాలం—ఆ యశ్వరాజముల నారోహించు నెడ గుఱ్ఱములను బట్టుకొనవలయును గాని యారోహకులఁ బట్టుకొన నక్కఱలేదు.

లవ—(గ్రహించి చిరునవ్వుతో) గర్దభసంతానమా ?

గౌత—(కోపముతో) ఛీ! దుర్మార్గులారా! నన్ను గాడిద నెక్కుమందురా ? చూడుఁడు గురువుగారితోఁ జెప్పెదను (నిష్క్రమింపఁబోవును)

కుశు—(అంపి) మిత్రమా ? పరిహాసమునకన్నఁ గోపింతువా ? తమ్ముని మాకు భవిష్య న్మంత్రి విట్లు తొందరపడవచ్చునా ? (తీసికొనివచ్చును.)

లవు—నేను బోయి యాగుఱ్ఱమును బట్టి తీసికొనివచ్చెదను అంతవఱకు మీరందఱి టనుండుఁడు, (నిష్క్రమించును.)

కాలం—కుశా ? మీసోదరునకు దానినిఁ బట్టునె పుణ్యము చాలదేమో, నీవు కూడఁ బోయి పచ్చెదవా ? మేమున్నను లేకపోయినను సమానమే.

కుశు—అక్కఱలేదు మాతమ్ముఁడే తీసికొని రాఁగలఁడు.

గౌత—(చూచి గుండెలపయిఁ జేతినిడికొని) అమ్మయ్యో ! ఎంత బండపనిఁజేయుచు న్నాఁడు దానినిఁ బట్టుకొనుట సామాన్యమా ?

కాలం—(చూచి) అయ్యో ! అది దాఁటిపోయినదే !

కుశు—(చూచి) అది దాఁటిపోవుటకాదు తమ్ముఁడే విడిచినాఁడు అదేమాడును మఱలఁ బట్టుకొనుచున్నాఁడు.

గౌత—(చూచి) లొంగినది దాని నిటులనే తీసికొని వచ్చుచున్నాఁడు.

(లవుఁడు యజ్ఞాశ్వముతోఁ బ్రవేశించును.)

కుశు—(సమీపించి) తమ్ముఁడా ! ఏదీ గుఱ్ఱము ? (ఉత్తరీయమును మెడకుఁ జుట్టఁబడిన దానినిఁ బట్టుకొని దానిముఖమునఁ గట్టఁబడిన చీటిని దీయును.)

లవు—రాముని యజ్ఞాశ్వమఁట యిది అందులకై సందేహించిరేమే దీనిని బట్టితీసికొని వచ్చితిని.

కుశు—(చీటి నిజదివి) తమ్ముడా? యెంతపనిఁజేసినావు! యజ్ఞాశ్వమును బట్టితివే దీనివె నుక శత్రుఘ్నుఁడగు శత్రుఘ్నుఁడు వచ్చుచున్నాఁడు అతనిని గెలువవలయును ఈ యనవసరపు జోక్యమేల ?

ఉ. రాఘవుఁడశ్వమేధమును • రావణమారణజాత పాతకో
మోఘవిచారణుండగెడపఁ • బూన్కినొనర్చునుండె దానినిఁ
బ్రాఘునవేగసంస్తుతమ • హాశ్వముఁబట్టఁ దలంపనౌనె ? సై
న్యౌఘముతోడ వారలు మ • హాధృతి వచ్చినఁబోరు శక్యమే ?

దీనిని విడిచివేయుము.

గౌత—ముందే యనుకొనినాము శ్రీరాముని యొద్దఁ దక్క వేఱొండెడనిట్టి యశ్వ రాజముండునా ? వాజిమేధమునకై విడువఁబడినదా యిది ? (లవునితో) లవ కుమారా ! నిన్ను బ్రతిమాలుకొందును దీనిని విడిచి వేయుము నీవు పట్టితివి

రావణమర్దనుఁడగు రాముని దని తెలిసిన వెంటనే విడిచివేయవలయును అతఁ
డు మనకుఁ బ్రభువు మనమాతని గౌరవింపవలయును ఈయజ్ఞమునకై మన
గురువుగారికిఁ గూడ నాహ్వానమువచ్చి యుండును మనకందఱకుఁ బురోడాశ
ములును భోజనములును దొరకును.

లవు—పిఱికి బ్రాహ్మణుఁడా! ఎట్టిమాటలాడుచున్నావు క్షత్రియుఁడు చేఁ జిక్కి-
న యశ్వరాజమును విడుచునా? అతఁడు జానకీ నాథుఁడైననేమి? గౌరీనా
థుఁడైననేమి? వారిబింక మెంతవఱకుఁ గలదో? పర్యవసానముఁ జూడ
వలసినదియే.

కుశు—తమ్ముఁడా! శ్రీరాముని బలపౌరుషములు రామాయణమునఁ జదివితివి కా
వున విడుమట మంచిది ఆతనిని గెలువఁజాలము.

లవు—అగ్రజా! నీవుకూడ వారియందుఁ గలియుము నాకేమియు భీతిలేదు నేను
గుఱ్ఱమును బట్టితిని నేనే వారినోర్చెదను ఆ శ్రీరాముని గెల్చిన గొప్పకీర్తి వ
చ్చును ఓడిన మనకప్రతిష్ఠలేదు పంక్తికంఠుఁడంతటివాఁడోడినాఁడు నాకిఁకఁ
బిఱికిమందు వేయకుము.

ఉ. అతఁడు విష్ణుదేవుఁడు మ ♦ హాత్ముఁడు జిష్ణుఁడు వానిగెల్చినన్
భూతలియందుఁ గీర్తియుఁ బ్ర ♦ మోదముఁగల్గుఁ బరాజయంబునన్
ఖ్యాతితొలంగదింతకయుఁ ♦ గ్రన్ననరావణ ముఖ్యులోడినా
రాతనికిన్ హయంబు విడు ♦ మంచును మీరలు పల్కకుండుఁడీ.

కాలం—లవకుమారా! నీయుక్తి మంచిదే కాని వారలను గెల్చుట యశక్యము.

చ. వలదు లవా! పితామహుఁడు ♦ ఫాలవిలోచనుఁడున్ సురేంద్రుఁడున్
గెలువఁగఁజాలరానృపునిఁ ♦ గీడ్పడుచేటే రణమందు నిత్యమా
నిలఁగలవారికిన్ రఘువ ♦ రేణ్యునిఁ దాఁకినగెల్పుగల్గునే
జలముపహింపనౌనె రణ ♦ సాధనముల్ గలవేజయింపఁగన్.

లవు—ఇతరులమాట యటు సర్వదివ్యాస్త్రములును బ్రత్యక్షమయి నన్నుఁ బ్రయోగిం
పుము నన్నుఁ బ్రయోగింపుమని తొందరపెట్టుచుండఁగాఁ గోఁతిమూఁకను
గెల్చుట కష్టమా? లక్ష్మణుని బాణముల ఘాటికి రావణుఁడు పెక్కుమూర్ఛ
వెన్నిచ్చెనఁట అది చూడవలయునని యున్నది తాటకాప్రాణములు హ
రించిన శ్రీరాముని శరవేగంబును గనులపండువుఁ జేసికొనియెద ద్రోణాద్రిం
దెచ్చిన హనుమంతుని లాఘవంబును జూడని బ్రతుకేల? ఇవియున్నియుఁ

దలంచి చాటునఁజేసిన రామునియుద్ధనైపుణ్యమును మునులయెదుటఁ జూచి గెల్పందికొందును తాతయిచ్చిన ధనుర్వేదమేమయినది ఒక్క నారాయణాస్త్రమునకు వారలందఱును యమపురిఁ జేరకుందురా ?

కుశ—తమ్ముఁడా ! నీయుత్సాహమునకు మేరలేకున్నది కానిమ్ము ఏమిజరుగునో చూతము రాముఁడు మహాబలుఁడగుటచే నట్లంటివి నేను మాత్రము వెనుకఁ దీయుదునా !

గౌత—మీరిరువురును గలసి మాప్రాణములు తీయుదురు యుద్ధరంగమును దలఁచుకొనిన భయముగానున్నది రామాయణమునందలి యుద్ధవర్ణనలు చదివినమీకును భయమగును ఈవెఱ్ఱిప్రయత్నములను మాని గుఱ్ఱమును విడిచిపెట్టుఁడు లేనిచో నాశ్రమములోనికిఁబోయి మీయమ్మతోఁ జెప్పెదను.

లవు—పోమ్ము చెప్పుము మాకేమియు భయములేదు వీరపత్నియు వీరమాతయునుగాదా మాతల్లి ? మమ్మేమియు ననదు విశేషించి మమ్ములను లాలించును.

గౌత—చూతముకాదా ? (బింకముతో నిష్క్రమించును)

శాలం—పోనిమ్ము లవకుమారా ! ఈగుఱ్ఱమును సంరక్షించుచు శత్రుఘ్నుఁడు వచ్చుచున్నాఁడు కొంచెముతడవులో నాతఁడును దీనిని వెదకుచు మనయొద్దకు వచ్చును. సంకులసమరంబగును ఈప్రదేశమునందులకనువైనదికాదు (చూపుచు) అటు పోవుదము రమ్ము.

కుశ—తమ్ముఁడా ! అట్లే చేయుదము. రా. (గుఱ్ఱముతో నందఱు నిష్క్రమింపఁగాఁ దెరపడును.)

ఇయ్యది శ్రీముదాత్రేయ విరచితంబగు నుత్తరరామచరిత నాటకంబున
యాజ్ఞికాశ్వగ్రహణంబను నది తృతీయాంకము.





# వీరలవకుశనాటకము.

## చతుర్థాంకము.



రంగము — వాల్మీక్యాశ్రమమునందలి పర్ణకుటీరము

(వాల్మీకి మహర్షియు శిష్యుఁడు గౌతముఁడును సంభాషించుకొనుచుఁ బ్రవేశింతురు.)

వాల్మీకి — గౌతమా! తర్వాత?

గౌతముఁడు — మునీంద్రా! ఆపరాశ్వమును దాను గ్రహింపఁదలఁచి పోయిపట్టెను.

వాల్మీ — అట్లనా? ఆతఁడు క్షత్రియకుమారుఁడు తగినపనినే చేసెను.

గౌత — పిమ్మట దాని మొగముపయిఁ గట్టఁబడిన లేఖను విప్పి చదివితిమిగదా (ఆశ్చర్యముతో) ఏమిచెప్పుదును? నాశరీరము కంపించిపోయినది.

వాల్మీ — ఏమున్నదియేమి?

గౌత — చెప్పెద వినుఁడు "త్రిలోకములను గెలిచి దేవేంద్రాది దిక్పాలురకుఁ బ్రిక్కలోని బల్లెమై భువనము లల్లలనాడించిన పంక్తికంఠుని బంధుమిత్ర పుత్రపరివారసహితముగాఁ జంపి లోకజేతయైన శ్రీరామచంద్రుఁడు వాజిమేధం బొనర్ప నెంచి యీయశ్వంబును విడిచెను. దీని సంరక్షణకై ససైన్యుఁడై శత్రుఘ్నుఁడగు శత్రుఘ్నుఁడు వచ్చుచున్నాఁడు శక్తిమంతుఁడగు క్షత్రియుఁడు దీనినిఁ బట్టునుగాక" అనియున్నది.

వాల్మీ — శ్రీరాముఁ డశ్వమేధమును గావించుచున్నాఁడా! (స్మరణకుఁ దెచ్చుకొని) అగును, నారామాయణమున నదియంతయు వర్ణించియే యుంటిని.

గౌత — (ఆత్రముతో) ఏమని వర్ణించితిరి? లవుఁడు గెల్చునా?

వాల్మీ — లవకుశులు గెల్తురు వారికోటమియుండదు వాండ్రు నిర్వక్రపరాక్రమాన్వితులు వారితోఁ బోర దేవేంద్రుఁడైనను బ్రదుకఁజాలఁడు ఇఁక మనుష్యులెంత వారలు!

గౌత—శ్రీరాముఁడు మనుష్యుఁడా! నారాయణుఁడని చెప్పితిరి కాదా? ఆతఁడు కూడ వీరికోడునా!

వాల్మీ—ఓడఁడు, అంతవఱకువచ్చును అంతఁ బరమేష్ఠి ప్రత్యక్షుఁడై యుద్ధమును మానిపించును

గౌత-అట్లయిన లవుఁడు లవుఁడు కాఁడు గురుఁడే కుశుఁడు కుశపాణియుడనుకొంటిని వైరిమత్తగజములపాలిటి యంకుశప్రఖ్యుఁడే

వాల్మీ—సందేహమా? వాండ్రకు సమస్త విద్యల నిచ్చితిని దానవారలు బాలకులయ్యు రణరంగమున ఫాలనేత్రునిఁ గూడఁ దిరస్కరింప నేర్తురు.

గౌత—అది యావాండ్రబింకము? నేనెన్ని చెప్పినను వినకపోయెను. అంత నేను మీతల్లితోను గురువుగారితోను జెప్పెదనంటిని అందునకాతఁడు మాయమ్మయుఁ దాతయు మమ్ములను వారింపక పోయి చెప్పుకొనుమనినాఁడు క్షేమె మీతోఁ జెప్పుమనుటచే వచ్చినాను శత్రుఘ్న పురస్కృతంబగు శ్రీరాముని పరివారంబు నాయిద్దఱు బాలకులెదిర్చి యుద్ధమొనర్చుట యుచితముకాదు. కావున నాని నాయశ్వమును విడువుమనుఁడు తాము రచించిన రామాయణమున రాముని శౌర్యమును దలచుకొని వీండ్రెంతయని తోఁచును అదియుఁగాక యాంజనేయాది కపివీరులందఱు నుండురుకదా లక్ష్మణుని పరాక్రమము ముందు వీండ్రమాట లెక్కయా!

వాల్మీ—వత్సా! అధైర్యపడకుము వాండ్రిందఱు వచ్చినను వీరలకుఁ జాలరు వాల్మీకి శిక్షితులగు సీతాపుత్రులను విశ్వామిత్రశిష్యుండును దదనుచరులును గెల్వనేర్తురా?

గౌత—తాముకూడ వారలను బ్రోత్సహించుచున్నారు నాకు భయమగుచున్నది.

వాల్మీ—నీవు భయములేను మనమీ మెట్టపైఁ గూర్చుండి వారల యుత్తరచరిత్రమును బరిశీలింతము.

గౌత—గురువర్యా! అటు చూడుఁడు (చూపుచు) కుశలవు లశ్వము నాచూత వృక్షమునకుఁ గట్టినిలుచుండఁగా వారియొద్ద కెవ్వరో యిద్దఱు క్షత్రియులు పోవుచున్నారు వారెవ్వరై యుందురు?

వాల్మీ—ఒకఁడు శత్రుఘ్నుఁడు శ్రీరాముని తమ్ముఁడు రెండవయాతఁడు సుప్రసిద్ధసేనానాయకుఁడు విజయసేనుఁడు.

గౌత—(భయమునటించి) అయ్యో! ఇంకేమున్నది? కొంపమునిఁగినది మఱలఁబోయి సీతాదేవితోఁ జెప్పుదునా?

వాల్మీ—భయములేదు రమ్ము ఆమెట్టనెక్కుదము అటనున్న మనకంతయుఁ గాన్పించును.

గౌత—అట్లే చేయుదము రండు (కమండలువు మొదలగునవి తీసికొని వాల్మీకిమునీంద్రునితో నిష్క్రమించును.)

ఇయ్యది విష్కంభము.



రంగము—వాల్మీకాశ్రమబాహ్యప్రదేశము.

(గుఱ్ఱమొక చూతవృక్షమునకుఁ గట్టఁబడి యుండును. దానిసమీపమున లవకుశులును గొంచె మెదుట శత్రుఘ్నవిజయసేనలు నుండఁగాఁ దెరలేచును.)

శత్రుఘ్నుఁడు—(లవునితో) కుమారా! నీపేరేమి? ఈగుఱ్ఱము నెవరు కట్టివేసిరి విడిచివేయుము ఇయ్యది శ్రీరామచంద్రుని యజ్ఞాశ్వము.

లవుఁడు—అయ్యా! నన్ను లవుఁడందురు దీనిని నేనే కట్టివైచితిని ఎందునకు విడువవలయును? శ్రీరామునిదైనంతమాత్రమున విడువవలయునా!

శత్రు—అట్లుకాదు. లవకుమారా! దీని నితరులు బంధింపరాదు ఒకవేళ బంధింపఁ దలఁచినచో శ్రీరామునితోఁ బోరు సామర్థ్యముఁ గలిగియుండవలయును మీరు బాలకులు మీకుఁ దెలియదు విడిచివేయుఁడు.

లవు—అయ్యా! ఇతరులు బంధింపరాదంటిరి అయినచో దీనిముఖమునందలి పత్రమేమి? శక్తికలవారలు పట్టుకొనవలసినదనియే కదా మాకు బుద్ధిపుట్టినది. మేము బంధించితిమి అవసరమైనచో శ్రీరాముని గెల్చెదము.

శత్రు—(తనలో) ఔరా! యీబాలకుల బింకము చూచిన బ్రాహ్మణులవలెనున్నారు క్షత్రియులవలెఁ బ్రత్యుత్తరమిచ్చుచున్నారు వీరినిఁ జూచినంతనే మానసమున నేదియో సంతోషము కలుగుచున్నది మాసీతాపుత్రులు కారుగదా? ఇద్దఱు నొకపోలికఁ గలిగియున్నారు. (ప్రకటముగా) నాయనా? (కుశునిఁజూపి) యాతనిపేరేమి? మీతలిదండ్రులెవరు? చెప్పినవినరా? శ్రీరాముఁడు సామాన్యుఁడుకాఁడు ఈయశ్వముఖమునందలి చీటియందు వ్రాసినది క్షత్రియుల విషయమైయున్నది. బ్రాహ్మణులు మీకేల?

ఉ. బాలక! యాజ్ఞకాశ్వమిది ♦ పార్థివశేఖరుఁడైన రామభూ
పాలకుఁ డీహయంబు విడు ♦ నెట్టి సమర్థులైన దీనిఁగట్టఁగాఁ
జాలరు శౌరిప్రభులు ♦ స్వర్గనగరేశ్వరుఁడైననోడు నా
శూలియుఁగప్పమిచ్చు విడు ♦ చొప్పుచితంబగు నీకు నియ్యెడన్.

**లవు**—అయ్యా! (కుశునిఁజూపి) యీతఁడు నాకగ్రజుఁడు కుశాహ్వయుఁడు మేము
వాల్మీకి శిష్యులము హయరాజమును విడువఁదలఁచలేము.

**విజయ**—నాయనలారా! మీరు పిల్లవాండ్రు మీకేమియుఁ దెలియదు ఈయశ్వము
ను విడిచిన శ్రీరాముఁడు సూర్యవంశజాతుఁడు రావణాసురునిఁ జంపిన మహా
వీరుఁడు ఆతని యశ్వమును మీరు పట్టరాదు.

**కుశు**—అయ్యా! నీవు దండనాయకుఁడవని తోఁచెడును మీ శ్రీరామునిం దత్సై
న్యములను నిమేషమాత్రమున గెలువఁగలము మాశక్తికి మీరెంతవారలు?
అదియుంగాక మీరు చెప్పిన రాముఁడెట్టివాఁడో మాకుము. తాటకను
సుబాహునిఁ జంపి మారీచునిఁ దఱిమినాఁడు స్వల్పులగురక్కసులను జంపి
యజ్ఞమును గాచినాఁడు బలహీనులగు నిశాచరులను ఖరదూషణాదులను జం
పినాఁడు చెట్టుచాటుననుండి కోఁతినిఁ జంపినాఁడు అబ్బబ్బ! యెంతెంతపనులు
చేసినాఁడు సుగ్రీవుఁడు మొదలగువారలు సహాయముచేయఁగా విభీషణుఁడు
లంకారహస్యములను జెప్పఁగా నెట్టకేలకు రావణునిఁ జంపినాఁడు.

కం. రాముఁడు వీరుఁడెందునను ♦ రావణు నెట్టులఁ జంపఁగల్గె నా
ధీమహితుండు మారుతి సు ♦ ధీరత వారిధి దాఁటిపోయి సా
ధ్వీమణి వార్తఁ జెప్పెను వి ♦ భీషణుఁడా రిపురంధ్రవిజ్ఞుఁడే
మేమియుఁ జెప్పినంతటఁ గ ♦ పీశుఁడు తోడ్పడఁ జంపె వానినిన్.

ఆరావణుని పరాక్రమంబెట్టి దందువేని వినుము.

మ. అనరణ్యుండను రాజుకోటఁ గృతవీ ♦ ర్యాత్మోద్భవుండాఁకియో
డెను శాఖామృగరాజుకోడె వనితల్ ♦ డెల్పర్పఁ జెట్టిపియుం
మన ఛీత్కృల్లి తొలంగెనా బలిపురిన్ ♦ ఘార్త స్వభావంబుతోఁ
జనిప్రార్థించి సజీవుఁడయ్యె విబుధ ♦ శద్వేషి సామాన్యుఁడే!

తే. గీ. అట్టివానిని మిత్రిల ♦ నధికబలులఁ
గూర్చుకొని శత్రుపురరంధ్ర ♦ కోవిదులను
దోడుఁజేసికొని జయింపఁ ♦ దొడఁగుమనికి
గౌరవంబె? ధర్మమగునె ♦ క్షత్రియులకు.

రావణునచే నాతనికి యశోహానియే కాని ప్రాప్తి కాదు ఇదిగో యిప్పుడీ యశ్వము
ను దీసికొనినచో నాతనిశక్తి బయటఁబడును బ్రాహ్మణుఁడగు పరశురాముని గెలు
చుట పౌరుషమనుకొంటిరా?

శత్రు—(కోపముతో) ఏమీ? శ్రీరాముఁడు మీకింత మలకనయయ్యెనా?

లవు—(నవ్వుచు) అట్లే లేదు హనుమంతుఁడు సంజీవి తేకున్నచో బరువగును అయ్యో! యెంత దురదృష్టము సకలక్ష్మాచక్ర పరిపాలకుఁడగు శ్రీరామచంద్రునకుఁ గోఁతిసాయము కావలసివచ్చినది.

ఉ. పంకజమిత్ర సంతతినిఁ • బ్రాభవమందె ధరాధినేతయై
జంకక శత్రురాజులను • శౌర్యపుకీర్తి సహించె నెట్టి యా
టంకము లేనివాఁడు యక • టా! హనుమంతునితోడ లేమిచో
బింకము తేలియుండు రిపు • వీరులఁ బాఁపుట మాటమాత్రమే!

విజయ—బాలకులార! మీకుఁ దెలియదు చెప్పినమాట వినకున్నారు మీతలిదండ్రు లపేర్లు చెప్పరైతిరి బ్రాహ్మణబాలురకింత శౌర్యమేల?

లవు—మాపరాక్రమము మీకుఁ దెలియదు మేము బ్రాహ్మణబాలురము కాము క్షత్రియులము వాల్మీకి మహామునీంద్రుని శిష్యులము,

శత్రు—(తనలో) క్షత్రియులఁట సీతారాములపోలిక వీరలయందుఁ గననగుచున్నది సీతబ్రదికియుండి పుత్రునిఁ గనినచో నిందొకనిఁ బోలియుండును, లేదా కవలను గనిరైనను సుండవలయును అట్లయినచో వీరలవయస్సునకు సరిపోవును ధైర్యశౌర్యాదులయందు వీండ్రు రాముని మించుచున్నారు.

ఉ. క్షత్రియపుత్రులందుఁ బలు • కంగడుసాదము పుట్టె మైథిలీ
పుత్రులెయయ్యెనొ యాపడఁతి • భూజనజీవగనున్నఁ గాంచినన్
శత్రునిబర్హణప్రథిత • శౌర్యమహీపుల సాత్మజన్ములం
జిత్రము వీరిఁబోలెదరు • చిహ్నలు కన్పడువారి విచ్చటన్.

వీరితో యుద్ధముఁజేయుటకుఁ జేతులు వచ్చుటలేదు (ప్రకటముగా) నాయనలారా! మీతలిదండ్రులపేర్లు చెప్పితిరి కావు మీవంటి బిడ్డలనుగన్న తల్లిదండ్రుల పావననామంబుల వినఁగోరుచున్నాము.

కుశు—అయ్యా! ఆసంగతులన్నియు మాతాతగారగు వాల్మీకి మహామునీంద్రునడుగుఁడు మాకుఁ దెలియదు తెలిసినను మీకు జెప్పము. మేము క్షత్రియులము గనుము.

శత్రు—నాయనా! క్షత్రియజాతికి మీవలన గౌరవములభించినది మీశౌర్యములకు బ్రమోదమయ్యె నాతోడరండు శ్రీరామునితోఁ జెప్పి మిమ్ములను బ్రభువులను జేయించెద అతఁడు మిమ్ములను గుమారులవలెఁ జూచుకొనును.

ఉ. నాయకులార! మిమ్ము గని ♦ నాయకుపొంతకుఁ బ్రీతితోడఁ గొం
పోయెదరండు రాముఁడు ప్ర ♦ మోదముతో నిజరాజ్యమిచ్చు మీ
రాయనఁ గాంచి యుంట తగు ♦ నంచనఁగాక వడిరెండు సత్వరం
బే యరుగన్ వలెన్ రఘుకు ♦ లేశ్వరు సన్నిధికిన్ లవా! కుశా!

లవు—ఆనుర్వాగ్రగణ్యుఁడా మాకు [illegible]? చాలు చాలు మహాపతివ్రతా శిరోమణియని యగ్నిసాక్షిగఁ బానెఱిఁగినదానిని ధర్మపత్నినిఁ బరిపూర్ణగర్భవతిని భూమిజాతను సీతామహాదేవినిఁ జాకివానిమాటలు పురస్కరించుకొని విడిచిన మహాపాపాత్ముఁడు రాక్షసుఁడు రాముఁడా మాకు యజమానికావలయును? శ్రీహరీ! ఎంతమాటవినవలసి వచ్చెను ఆజగన్మాత సీతయెంత విచారించెనో గదా; ఆమె యుసురు మీకుఁ దగులక మానదు అంతవఱకేల? మూర్ఖుఁడవు పత్నీద్రోహియునగు నాకౌసల్యేయుని దండించి సిగ్గుఁ గలుగుటకే యీయశ్వమును బంధించితిమి

శత్రు—లవా! లవుఁడవగు నీవచనములు పాటిచేయనక్కఱలేదు లోకధారుఁడగు శ్రీరామచంద్రుని దూషించుచున్నాఁడవు ప్రజారంజనమునకై ప్రాణాధికయగు వైదేహినిఁ గూడ విడిచిన యాతని ప్రజారంజకత్వమును మెచ్చుకొనవలదా? అయిన నాతఁడు పరకాంత పరిగ్రహణముచేసి కొనెనా? తానామెను విడిచినను సీతాగతమనస్కుండై యెల్లకాలము హా! సీత! హాజనకరాజనందని! హాప్రదేకప్రాణ? హాదండకారణ్య సహచారిణి! హా యనిచే నిట్టూర్పు విడుచుచు దుఃఖించుచుండునుగదా,

చం. ప్రజలకు సంతసంబుఁగొలు ♦ పన్ నిజభామిని సీతవీడినాఁ
డజులను గూడమించునతఁ ♦ డాలిని వీడియు నన్యకాంతనం
బుజ వదనన్ గ్రహింపఁడయె ♦ భూమిజకై విలపించు నెంతయున్
విజనగృహంబునందె పరి ♦ వేదననందుచు నుండ నెప్పుడున్.

ఆతనిని దూషింపవచ్చునా? రాముఁడు దోషియైనచో వసిష్ఠ వామదేవాది మునీంద్రులాతని కడనుందురె?

లవు—వారెల్లరును రాజోపచారములకు మఱఁగి యాతని కెదురాడకుందురు మా వాల్మీకి తాత మొదలగు వారలేమందురో? కట్టా! శ్రీరాముని ప్రజారంజకత్వమునకుఁ బ్రాఁగుబోఁతులగు రజకులే ప్రమాణపురుషులా? కొందఱు ప్రభువులు రామునివంటివారు ప్రజారంజనకై జారత్వమును జోరత్వమును బరస్వ

హరణము మొదలగు మహాకార్యములను జేయించుచుఁబై యట్లుగ సమాధానముఁ జెప్పెదరేమో.

శా. అయ్యో! యేమిది తాఁగుఁబోఁతు రజకుం ♦ డన్నన్ సతీరత్నమున్
వెయ్యార్భంగుల నెంచకుండ విడిచెన్ ♦ విశ్వంబుదూషింపఁగా
న్యాయ్యంబేయటు లాచరించుట నవాం ♦ తర్వత్ని భూజాత సా
హాయ్యంబేమియులేక పంపఁదగునే ♦ యారణ్యసీమాళికిన్.

శత్రు—(కోపముతో) ఓయీ డింభకా! ఊరకున్నకొలఁదియు నీయుపన్యాసములు మితిమీఱుచున్నవి. నీతండ్రి యిటనుండెనా?

లవ—ఏమి బింకము? మాటలయందుమాత్రమేనా? పోరులయందుఁ గూడ నుండెనా? అయినను నాతండ్రి సంగతి నీకేల!

శత్రు—కాను పోయి యాతనితోఁ జెప్పి యాతనిని దీసికొనిరమ్ము.

లవ—అతని నేఁటికేల? నాకు నీవు సమాధానముఁ జెప్పెదవా?

శత్రు—శబ్దప్రయోగమునందా? శరప్రయోగమునందా?

లవ—ఎందైనను సరియే మాతాతగారు వాల్మీకులు, వారు నాకు నథర్వణవేదమును సమస్త దివ్యాస్త్రములును బ్రసాదించినారు నాతోఁ బోరు మీకు లాభకారి కాదు.

శత్రు—ఓయీ! వాచాటా! లోకత్రయమును గెల్వఁగోరిన మాంధాతృ చక్రవర్తి యెవ్వనిఁదాఁకి భస్మమయ్యెనో! యెవ్వనికి రుద్రదత్తమగు దివ్యశక్తికలదో యాలవణాసురుఁడు మధుసుతుఁడు నాతోఁబోరి చచ్చెను నీవెంతటివాఁడవు? ముక్కుపచ్చలారని పసివాఁడవు గర్వమును విడువుము నిన్ను రక్షింతును.

కుశ—నన్ను రక్షించుటకును శిక్షించుటకును నీవు చాలవు. నీయెడల మేము సమర్థులము శ్రీమద్రామాయణ కర్తలగు మాతాతగారు నీలవణాసుర యుద్ధమును వర్ణించియే యున్నారు అట్టి యాడంగియుద్ధమును నీవుమాత్రమే చేసితివి ఛీ! యింకను మాయెదుట నిలిచెదవా?

విజయ—బాలకులారా! అదే మాసేనఁజూడుఁడు యుద్ధసన్నద్ధమై వచ్చుచున్నది మీరేమి చేయఁగలరు?

లవ—చంపమందువా? చెదరఁగొట్టమందువా?

శత్రు—చెదరఁగొట్టుటకైనను మీకు శక్యమా?

లవ—ఇదే చూడుము (మంత్రించి వాయవ్యాస్త్రమును వదలును సేన చెదరిపోఁగా విజయసేనుఁడు దిగులుపడును.)

శత్రు—(ధైర్యముతో) సెబాస్ లవకుమారా! నీశౌర్యము మెచ్చఁదగియున్నది నా సేనలను నిమిషమాత్రమున నాశనముఁజేసితివి కానిమ్ము నాతో యుద్ధముఁ జేతువా? పిల్లవాఁడవు ముందుగ నీవు బాణము విడువుము.

లవు—ఆలస్యము చేయుట నాయుద్దేశము కాదు ఇదే గాంధర్వాస్త్రము దీనితో నిన్నును నీసేనానాయకుని మూర్ఛఁగొల్పెదను కాచికొనుఁడు.

(మంత్రించి బాణమును బ్రయోగింపఁగా నిద్దఱును మూర్ఛిల్లెదరు.)

కుశు—తమ్ముఁడా? మంచిపనిఁజేసినావు సంశయాస్పదములగు యుద్ధముల నాలసింపరాదు ఇప్పుడు వీరినేమి సేయుదము?

లవు—ఈశత్రుఘ్నునిఁ దీసికొనిపోయి మనము చదువుకొను పర్ణశాలయందుఁ బరుండఁబెట్టుదము మఱల నెవ్వరేని వత్తురేమో చూతము ఈగుఱ్ఱము నా యశోకవృక్షమునకుఁ గట్టివేయుదము తాతతోఁ జెప్పవత్తము.

కుశు—మంచిదట్లనే చేయుదము (ఇద్దఱును శత్రుఘ్ను నెత్తుకొని పోఁగాఁ దెరమాఱును వాల్మీకియు గౌతముఁడును బ్రవేశింతురు.)

గౌత—మునీంద్రా! లవుని ప్రతాపమును జూచితిరా? శత్రుఘ్నుని గెల్చి తీసికొనిపోయినాఁడు అయినను రామాయణమునఁ దాము లవణాసురునిఁ జంపిన మహావీరుఁడని వర్ణించిన దీనినే కాదా?

వాల్మీ—ఔను నా తెచ్చిపెట్టినవాఁడే కాని యీలవకుశులకువారలు చాలుదురా?

గౌత—అయ్యా! వారలు నలువురన్నదమ్ములుకదా శత్రుఘ్నుని పాటువిని రాముఁ డూరకుండునా? మఱల నెవ్వరినైనఁ బంపునేమో?

వాల్మీ—(దివ్యదృష్టినిఁజూచి) అప్పుడే పంపినాఁడు భరతుఁడు నరవానరబలంబులను గూర్చుకొని జాంబవత్పురస్కృతుఁడై వచ్చుచున్నాఁడు ఈవేళకు రావలసినదే ఈచెట్టెక్కి చూడుము (చూపును.)

గౌత—(నిష్క్రమించి మఱలఁ బ్రవేశించి) గురువరా! వచ్చినారు మనలవకుశులును భల్లూకమొకటియు నొక రాజకుమారుఁడును వచ్చుచున్నారు. అందఱు నిట్లే వచ్చుచున్నారు.

వాల్మీ—అట్లయిన మనము యథాప్రదేశమునకుఁ బోయి సంగ్రామవిధానమును జూచుచుందుదము.

గౌత—అట్లనే చేయుదము రండు (నిష్క్రమింతురు.)

(తెఱమాఱఁగా వెనుకటి యుద్ధరంగము గాన్పించును లవకుశులును భరతజాంబవంతులును బ్రవేశింతురు.)

జాంబ—కుమారులారా! మీరేనా? యీయజ్ఞాశ్వమును గట్టివైచినది?

కుశ—అగునంతియే కాదు వీరమ్మన్యుఁడగు శత్రుఘ్నుని ససైన్యునిఁగా నోర్చినదియు మేమే?

భర—మీరలెవరి కుమారులు?

లవ—క్షత్రియులము.

భర—(పోలికఁజూచి తనలో) ఈబాలురు రాముని ప్రతిబింబమువలె నున్నారు వనమునందు విడువఁబడిన గర్భవతి సీత యెట్టెట్టో జీవించి యీబిడ్డలను గాంచినదేమో? లేనిచో వీండ్రియందు నాకీప్రేమ మేల జనింపవలయును? అయినను దెలిసికొనియెదనుగాక, (ప్రకటముగా) బాలకులారా! మీతలిదండ్రులెవరో తెల్పవారుకారు.

కుశ—వాల్మీకిమునీంద్రు నడుగుఁడు ఆయన చెప్పును మేము క్షత్రియులము సందేహము లేదు మీశత్రుఘ్నుని గెల్చితిమి మిమ్ములను గెల్వఁగోరెదము ఈభల్లూకము కూడ మీసహాయమునకే వచ్చెనా!

భర—ఓయీ! మేమెవరమో తెలిసినదా? (జాంబవంతునిఁజూపుచు) ఈతఁడు బ్రహ్మపుత్రుఁడగు జాంబవంతుఁడు ఋక్షవానరప్రభువు సమస్త వానరేశ్వరుఁడగు సుగ్రీవుని మంత్రి.

ఉ. ఈతఁడు బ్రహ్మపుత్త్రకుఁడు ♦ ఋక్షధవుండు మహాబలుండు ని
ర్ఘాత సమానవేగుఁడు వి ♦ కస్వరబుద్ధి సమేతుఁ డాజి మా
జాతను రామతోఁ గలుప ♦ సంగరమోర్చినవాఁడు వామనుం
డాత్తత దేహుఁడౌ నెడను ♦ ౯౯ సిభజించెఁ బ్రదక్షిణంబులన్.

లవ—ఇఁకఁ జెప్పనక్కఱలేదు అంతయుఁ దెలిసినది వాలికిజంకి దేశదేశములు పాఱిపోయిన సుగ్రీవుని మంత్రి ఇప్పుడు శ్రీరామునకు సాయపడవచ్చి లవకుశులచేఁ బూర్వార్జితయశంబును ధారవోయ నున్నాఁడు మీరెవరు!

జాంబ—ఈ మహావీరుఁడు శ్రీరాముని తమ్ముఁడు భరతుఁడనుపేర విఖ్యాతిఁ గాంచినవాఁడు.

ఉ. ఈతఁడు రాఘవానుజుఁడ ♦ హీనగుణాకరుఁ డార్యభక్తి సం
భూత యశోవిలాసుఁడు సు ♦ పుణ్యచరిత్రుఁడు భ్రాతృసేవకై

మాతను రాజ్యముకై సుదతి ♦ మాండవి నిర్వ్యాజియించి యుండె సం
జాత విచారుఁడై బయట ♦ శాంతిఁ బహించి చతుర్దశాబ్దముల్.

లవు—(చెవులమూసికొని) హరిహరీ ? ఎట్టిపాపపు మాటలు వినవలసివచ్చెను పాపా
త్ములైరాలగు కైకయొక్క పుత్రుఁడా యీతఁడు (భరతునితో) ఎట్టిదురాత్మ
గ్గుఁడవు మీచరితము తెలుఁగనివారియొద్దఁ జెప్పికొనుము.

భర—(కోపముతో) బాలకుమార! మీమాటల నసహ్యములుగనున్నవి అపరిస్తుతము
లను మాని యజ్ఞాశ్వమును వదలునదియు లేనిగుయుఁ జెప్పుఁడు.

లవు—శత్రుఘ్నుఁ డింటికంటె వెన్నుపిగ బీరములుపలికెను.

జాంబ—అయిన యుద్ధమున కభిముఖులుకండు రావణుసేనలఁ బిలువమార్చిన యీ
బుుక్ష వానరభటుల నిందఱను గెలువవలయును మీరిప్పు రేమి చేయఁగలరు ?

ఉ. రావణుసేనలన్ గెలిచి ♦ లంకనుగూలిచి కీర్తిఁగాంచినా
పావక శత్రుపార్థివుల ♦ పోరుల నిల్చి జయంబుఁగొన్నవా
రీవరదోర్బలాధికుల ♦ హీనులు భల్లుకవానరావళుల్
పావక సన్నిభుల్ కృపము ♦ భంగమగుకై విడువుండు గుఱ్ఱముల్.

లవు—అభంగము మీకని తెలిసికొనుఁడు.

కుశు—శ్రీరాముఁడు దండకాటవి యందేమిచేసెను ?

భర—(తనలో) ప్రపంచానుభవములేని యీబాలకులకును నిపల్లెలనుండువారికిదండ
కారణ్య వృత్తమెట్లు తెలిసినదియో ? అదియుంగాక జాంబవంతుఁడు సుగ్రీ
వునితోఁ గూడ బలాయనుఁడెగుట యనన్యవిదితముకదా (ప్రకాశముగా)
బాలకా! యీసంగతి నీకెట్లు తెలిసినది ?

లవు—మాతాత రామాయణమును వ్రాసెను అందుమీసంగతి యంతయు వర్ణింపఁ
బడినది.

భర—సరియే మాయన్నగారితోఁ జెప్పి మీకు రాజ్యమిప్పించెదము గుఱ్ఱమును వదలి
నాతోఁ రండు.

లవు—(సగర్వముగా) మీరిచ్చు వారలును మేము పుచ్చుకొను వారమును ? కావలసి
న చోనరనిమేషకాలమున మీకుసప్తద్వీప పరిమండితభూమండలాధిపత్య
మును బ్రసాదించెదము.

ఉ. ఇత్తురెమీకు రాజ్యమును ♦ హీనులమే యన్నికైకొనంగ నా
యత్తుకెపోవుసల్పుటకు ♦ నర్ధనిమేషమునన్ ధరాతలిన్

సత్తువతోడ గెల్చి రణము ♦ జాతునకర్థియైన వెంటనే
యిత్తుమయేడు దీవులను ♦ ఈప్సితపూర్తికి మీకుఁ గోరినన్.

జాంబ—జన్నంపుఁ దురంగంబును విడువకుండుట నిశ్చయమేనా ?

లవు—మాచే వాలమజాలఁ జెప్పించకుము శక్తియున్న మమ్ము గెలువుము.

జాంబ—ముందుగ మా సేనలను గెలువుఁడు.

లవు—ఏమి బింకముగాఁ జెప్పుచున్నావు నీయెదుట నీసేనలు పడుపాట్లు చూడుము.

(వారుణాస్త్రమును బ్రయోగించును.)

జాంబ—(అతివృష్టిచే సేనచెదరిపోఁగా భరతునితో జనాంతికమున) అయ్యా! దీనిని వారింపుఁడు సేనలు నాశనమగుచున్నవి.

భర—(జనాంతికమున) వీండ్రకు దివ్యాస్త్రములు మెండుగఁగలవు మనము గెల్తుమను నమ్మికలేదు.

జాంబ—ఓయీ! నీశక్తికి మెచ్చితిని (విజృంభించి) నాతోఁ బోరెదరా ? పెక్కురు రక్షోవీరులు నాముష్టిఘాతలచేఁ జచ్చిరి.

లవు—మీసంగతులను జెప్పనక్కఱలేదు కొంచెము తడవులో సమస్తమును మీకే తెలియును నీముష్టిఘాతలు పడుటకు మేము వెఱ్ఱివాండ్రముకాము నీవు బ్రహ్మపుత్రుఁడవు కావున నిన్ను గౌరవింపవలయును చూడుము.

తే. గీ. అసురవర్యుల గెల్చి వి ♦ ఖ్యాతిఁ గాంచి
నావు పద్మజసుతుఁడవు ♦ న్యాయవిదుఁడ
వట్లు కావున నిన్ను బ్ర ♦ హ్మాస్త్రశక్తిఁ
బంజరంబున బంధింతు ♦ భల్లుకేశ !

(ధ్యానము నటించును.)

జాంబ—(నిశ్చేష్టుఁడై నిలుచును.)

భర—హా జాంబవంతా! బ్రహ్మకుమారా! నీ తెల్వితేటలవలని ప్రయోజనము లేక పోయినది ఏదివ్యాస్త్రములును నిన్ను బాధింపవని నమ్మియుంటిని చివరకు బ్రహ్మాస్త్రమునకు లొంగితివి.

జాంబ—అయ్యా! ఈబాలకులు ధనుర్వేదమును సాంతముగా నేర్చినవారలు అదియుంగాక పరేంగితవిజ్ఞులు నాకస్త్రములచే మృతిలేదని యెఱింగిన వీరలు బ్రహ్మాస్త్రముచే నస్త్రపంజరమును నిర్మించి నన్ను బంధించినారు.

భర—సరియే నాశక్తినిఁ గూడ వినియోగింతును.

లవు—భరతమహారాజా! నీవు మాపయి నస్త్రప్రయోగమును జేయుము.

భర—అట్లనే చేయుదును. (చేయఁబోయి మనసురాక మానును.)

లవు—అయ్యా! వెనుక తీయుదువేమి?

భర—వత్సా! మీమీఁద బాణము వేయుటకుఁ జేతులు రాకున్నవి.

కుశు—చేతకానివాని పలుకులివి మీ సేనయొక్కయు సేనానాయకునియొక్కయు గతినిఁ గాంచియుఁ జేతులు రావనినఁ బ్రయోజనమున్నదా?

భర—అట్లయిన మనమా బయటికిఁ బోయి ద్వంద్వయుద్ధమొనర్తము.

లవు—మంచిది రండు. (నిష్క్రమింతురు.)

(తెరమాఱఁగా వాల్మీకియు గౌతముఁడును బ్రవేశింతురు.)

వాల్మీ—గౌతమా! వారినిఁ జూచినావా! భరతునితోఁ గుశుఁడు పోరుచున్నాఁడు.

గౌత—అయ్యా! చూచినాను భరతుఁడు మొదట సంశయించెను గాని చివరకు వెనుదీయక కలియఁబడెను.

వాల్మీ—కుశునిఁ జూడుము ఆగ్నేయాస్త్రమును బ్రయోగించినాఁడు (చూచి) అదే భరతుఁడు దానిని మేఘాస్త్రమున వారించుటకుఁ గనిసి సీతాపుత్రుఁడు పర్వతాస్త్రమును దానికా కేకయీతనయుఁడు కులిశమును బ్రయోగించినాఁడు.

గౌత—మునీంద్రా! చూచినారా! లవుఁడు కుశునిఁ దొందరచేయుచున్నాఁడు కుశుఁ డాలసింపనోపక పాశుపతాస్త్రమును సంధించినాఁడు (తత్తరముతో) అయ్యో భరతమహారాజా! చచ్చిపోవుచున్నావు శ్రీరాముని శరణుఁ గోరుకొనుము.

వాల్మీ—గౌతమా! భరతుఁ డనుమాటలు వింటివా?

గౌత—ఏమనినాఁడు నేను సరిగ నాలకింపలేదు.

వాల్మీ—వినుము "శ్రీరాముఁడు నారాయణుండేని సీతామహాదేవి జగన్మాతయైన యిందిరాదేవియై పతివ్రతాశిరోమణియేని నేనా పూజ్యదంపతులను దలిదండ్రులనుగా నెంచి పూజింతునేని నన్నీ పాశుపతము బాధింపకుండుఁగాక;

గౌత—గురువరా! అతఁ డెంత యుక్తిఁ జేసినాఁడు ఈ పాశుపతాస్త్రాధిదేవతయగు మహాదేవుఁడు తారకనామ సంకీర్తన పరుఁడగుటవలనఁ దానా తారకమంత్రదేవతయగు శ్రీరామచంద్రుని యెడలఁ బ్రీతినఁ జేసినఁ దనకు విముక్తి కలుగునని యెంచి యట్లనినాఁడు పాపమీతనికిఁ బాశుపతాస్త్రము తెలియదు కాఁబోలును.

వాల్మీ—కావుననే యట్లు చేసినాఁడు (చూచి) దానిచే నాతఁడు మూర్ఛితుఁడైనాఁడు (మరలఁ జూచి) అయ్యో! వాండ్రాతనిని మోచికొనివచ్చుచున్నారు.

గౌత—(చూచి) జాంబవంతునిఁ గూడ దీసికొనిపోవుచున్నారు.

వాల్మీ—ఎంతపనిఁజేయుచున్నారు?

గౌత—(చూచి) మునీంద్రా! చూచినారా? వాండ్రిద్దరు దాము చనుచు కొను పర్ణకుటీరమునకుఁ గొనిపోవుచున్నారు.

వాల్మీ—(దివ్యదృష్టినిఁ జూచి దూరావలోకన మొనర్చి చూపుచు) గౌతమా! అవచ్చువారలను జూచితివా? ఒక వానరుఁడొక రాజపుత్త్రుఁగొని వచ్చుచున్నాఁడు.

గౌత—(చూచి) మునీంద్రా! లక్ష్మణుఁడా యా రాజపుత్త్రుఁడు. ఆ వానరుఁ డాంజనేయుఁడా?

వాల్మీ—అగును వాండ్రే మనోవేగమున వచ్చినారు.

గౌత—వారి కీసంగతి యప్పుడే తెలిసినదా?

వాల్మీ—దివ్యజ్ఞానియగు వసిష్ఠుఁడు భరతుఁడోడెనని చెప్పి తద్రక్షణార్థమై యుద్ధతీవ్రపరాక్రములను హనుమల్లక్ష్మణులను బంపెను అంతట వారు వచ్చుచున్నారు వారివెనుకఁ జూచితివా! వాలిపుత్త్రుఁడంగదుఁడు వచ్చుచున్నాఁడు.

గౌత—(చూచి) అయ్యో! అల్లదె చూచితిరా! లవకుశులు కూడ వచ్చి కలిసికొనినారు వారేదియో సంభాషించుకొనుచున్నారు ఇటులనే వత్తురని తోఁచుచున్నది మన మీమెట్టపైఁ గెక్కుదము (గౌతమునితో నిష్క్రమించును)

(తెరమాఱఁగా హనుమదారూఢుఁడగు లక్ష్మణుఁడును వాలిపుత్త్రుఁ డంగదుఁడును లవకుశులును బ్రవేశింతురు.)

హనుమంతుఁడు—(లక్ష్మణుని దింపును.)

అంగదుఁడు—బాలకులారా! మీరేనా! శ్రీరామచంద్రుని యజ్ఞాశ్వమును బంధించినది?

లవు—ఏమట్లడుగుచున్నావు?

హనుమంతుఁడు—తెలిసికొనవలదా! (తనలో) ఈబాలురు శ్రీరాముని పుత్త్రులవలెనున్నారు మాయమ్మ జీవించియే యున్నదేమో? సీతారాముల చిహ్నలీబాలురయెడఁ గాన్పించుచున్నవి లక్ష్మణుఁడామె సేవనమున విడిచెనో?

కుశు—నీకుఁ దెలియకపోయిన లోపమేమి?

లక్ష్మణుఁడు—మీరే బంధించితిరని తోఁచుచున్నది భరత శత్రుఘ్నులను విజయసేన జాంబవంతులను గూడ గెల్చితిరా?

లవు—పోయి కనుఁగొనుము మీరెవరు ?

అంగ—(హనుమంతునిఁజూపి) ఈతఁడు శ్రీరాముని భటుఁడు భక్తుఁడు అంజనాగర్భ సంజాతుఁడు.

లవు—మహాత్మా! ఆంజనేయా! నీపరివర్తనమునకు సంతసించితిమి సీతాదేవిని శ్రీరామునితోఁ గూర్చితివి నీవే పరోపకారపరాయణుఁడవు.

హను—(తనలో) ఔరా ! యేమి యీవింత ?

శా. సీతారాముల పోల్కిఁ దాల్చిరి ధరా ♦ సీమంతినీభర్తలా
భాతిన్ జిహ్నలు కానిపించెడినిది ♦ వ్యాహారభవోపేతులై
ఖ్యాతింగాంచెదరంచుఁ దోఁచెఁగనలీ ♦ క్ష్మామండలిం బ్రేమసం
జాతంబయ్యెను వీరియందుఁ బ్రియనో ♦ త్సాహంబు త్రిణించెడిన్.

అంగ—(లక్ష్మణునిఁజూపి) ఈతఁడు సౌమిత్రి.

కుశ—వనవాసకాలమున శ్రీరామునితోఁ గూడఁ గడపుచు నిద్రాహారంబులును సమస్త సౌఖ్యములును విడిచి యాతనిని సేవించిన సద్గుణధాముఁడా యీతఁడు? మఱియు సంతసంబయ్యెఁ గాని యీతనియందొక యపగుణమాత్రము కలదు.

హను—ఏమది ?

లవు—జగన్మాతయగు సీతాదేవిని నిండుచూలాలిని మహారణ్య మధ్యంబున విడిచి దిక్కులేక చావుచున్న మఱిపోయెను అక్కటా! ఆమె యెంతయేడ్చెనో కదా; వన్యమృగముల కెరయైనదియో మో ?

తే. గీ క్రూరమృగజాతి యుతమైన ♦ ఘోరకాన
నమున విడిచి జానకి నొంటి ♦ గ ముదితాత్ముఁ
డగుచు సాకేతపురికేగె ♦ ననఘుఁడనెడి
యశము తొలఁగ నిసౌమిత్రి ♦ యాంజనేయ !

లక్ష్మ—హా బాతా ! (విచారముతో నేలపయిఁబడును.)

తే. గీ. అనఘ! వాల్మీకి మాతాత ♦ యాంజనేయ !
రాముచరితంబు రచియించె ♦ బ్రహ్మపుత్రుఁ
డయిననారదుఁడు తెలుప ♦ నాలకింపి
శ్లోకకోటి శతంబుల ♦ సులభశైలి

ఉ. సీతను గానయందువిడి ♦ చెన్ రఘుజాతుఁడు లక్ష్మణుండు నా
తల్లి నింద లేనియుప ♦ మాన్యుఁడు కాఁడెయతండు వజ్రికిన్

శ్వేతగిరీంద్రజాపతికి • విష్ణువిధాతలకున్ సురాళికిన్
ఖ్యాతమహాగుణాంబునిధి • పోల్పఁగనంగద భ్రాతృసత్సుతా.

హను—బాలకులార! మీకు శ్రీరామచరిత్ర మెట్లు తెలిసినది.

కుశు—మా తాతగారు వాల్మీకులు వారు శ్రీమద్రామాయణమును వ్రాసిరి మాకు జెప్పిరి.

హను—అయినచో సమస్తమును మీకు తెలిసియే యున్నది. పితృసముఁడును బ్రభువు నగు శ్రీరాముని యాజ్ఞల నితఁడు పాలింపవలదా? ఈలక్ష్మణుని శీలమును రామాయణము నందు మీరు చదివిరే యుదుర ఈతఁడు సీత నెట్లు చూచును?

లవు—కన్నతల్లికంటె నెక్కువగఁ జూచును.

హను—ఈతఁడు మూర్ఛపోయిన దెందులకో యెఱుఁగుదువా?

లవు—సీత నితఁడు విపినమున విడిచినవాఁడు ఆమాటను దలపెట్టఁగానే యెక్కువ విచారము తోఁప నిట్లు మూర్ఛిల్లినాఁడు

అంగ—ఇఁక నీయనవసర ప్రశ్న లెందులకు ఈతనిని మూర్ఛఁ దీర్పవలయును.

లవు—నేను జేసెదను జూడుఁడు. (లక్ష్మణుని చెవియొద్దకుఁ బోయి 'సీత బ్రదికి యున్నది' అనపల్కును.)

లక్ష్మ—(తటాలున లేచి) ఏదీమాతల్లి! అమ్మా! వైదేహీ! సుఖముగనుంటివా! నిన్న డవియందు విడిచిన దుర్మార్గుఁడు లక్ష్మణుఁ డిదియే నమస్కరించుచున్నాఁడు. (నమస్కరించును)

హను—(లవునితో) ఏదీజగన్మాత సీత?

లవు—ఊరకయనినాను ఈలక్ష్మణుఁడు సీతను దలఁచుకొనుచు మూర్ఛిలుటచే నామె కుశలముగ నున్నదని తెల్పినఁ దెప్పతేలునని యట్లంటిని.

లక్ష్మ—(నిట్టూర్పుతో) హాజనని! మమ్ము విడిచిపోయితివే!

కుశు—మీరామెను జేతులార నడవిని విడిచియేల విచారింతురు?

అంగ—గత జలసేతుబంధన మేల? మీ పేర్లేమి?

లవు—(కుశునిఁజూపి) ఈతఁడు మాయన్న కుశుఁడు.

కుశు—ఈతఁడు లవుఁడు మేము వాల్మీకి శిష్యులము.

లక్ష్మ—(తేఱిచూచి) ఆ! యేమి? శ్రీరాముని కుమారులా? నాయనలారా! యిటురండు మీతల్లి యెక్కడ నున్నది మీకుకవలా?

కుశు—(తనలో) ఏమి చెప్పుదు ? యీతఁడిట్లనుచున్నాఁడు. (ప్రకటముగా) మే
ము కవలమే కాని శ్రీరామ పుత్త్రులము కాము వాల్మీకి మహాముని మా తా
త, మాజనని పర్ణశాలయందున్నది. శత్రుఘ్నుఁడును భరతుఁడును జాంబవం
తుఁడు నక్కడ నేయున్నారు.

హను—(ఆశ్చర్యముతో) జాంబవంతుని గెల్చితిరే అతని నస్త్రములు బాధింపవు.

లవు—అస్త్ర పంజరమున బంధితుఁడై యున్నాఁడు.

లక్ష్మ—మమ్ములను గూడ మీజననియొద్దకుఁ గొనిపోయెదరా ? (తనలో) సీతాదేవి
ని నే నీవనములందే విడిచి పోయియుంటిని ఆమె యెట్లో వాల్మీక్యాశ్రమ
మును జేరి యీకవలను గనియుండును లేనిచో భరత శత్రుఘ్నులను జాంబ
వంతుని గెల్చు వీరులు కలరా ? వీండ్రను జూడఁగా నాకేదియో యావేదన
కలుగుచున్నది.

చం. విడిచితి సీత నీవనిని ♦ వేదములందుచు నామె యెట్టులో
నడచుచుఁ జేరియుండు ముని ♦ నాథుని పల్లియ వారి యందు నీ
యెడఁ బ్రసవించియుండు విబు ♦ ధేశ్వరతుల్యుల నీకుమారులన్
జడమతినై గ్రహింపఁగ న ♦ శక్తుఁడనైతిఁ బదీయసంస్థితిన్.

కుశు—ఇప్పుడు కాదు సంగ్రామమున మిమ్ముల బంధించినపిమ్మట

లక్ష్మ—బాలకులారా ! యుద్ధము మంచిదికాదు గుఱ్ఱమును వదలుఁడు మిమ్ములను
శ్రీరాముని యొద్దకుఁ గొనిపోయి ప్రభువులను జేయింతును.

లవు—వనవాసులకు మాకెందులకు రాజ్యములు ? వానిని మీరే యనుభవింపుఁడు
ఇఁక నెప్పుడు నిట్టి యశ్వమేధములను జేయకుఁడు మమ్ములను శరణుఁజొ
చ్చి మీప్రాణములను దక్కించుకొనుఁడు పతివ్రత నేడిపించుటవలన మీశ
క్తులు తగ్గినవని తెలిసికొనుఁడు.

చం. వనములనుండు మాకుఁ బ్రభు ♦ త్వైభవమేల ? దురాశయేల ? స
న్మునిజనసంశ్రయార్జిత త ♦ పోరతి చాలదె ? యిట్టియజ్ఞముల్
జనునె యొనర్పఁగా నితర ♦ సాధ్యులనా ధరణీశ్వరాళికిన్
వినయముఁదాల్చి పొందు రఘు ♦ వీరునకున్ వినిపింపుఁడీ స్థితిన్.

ఆ. వె. సాధ్వి నేడిపింప ♦ శక్తులన్నియుఁ బోయె
మీకనుమునెఱింగి ♦ మిత్తివాతఁ
బడక పొందు దివ్య ♦ బాణాస్త్రవిదులము
మమ్ముఁ దాఁక నౌనె ? ♦ మఱలిపొండు.

లక్ష్మ — లవకుమారా! మీయందు నాకేదియో యనిర్వాచ్యమగు ప్రేమ జనించుచు
న్నది మీజనయిత్రినిఁ జూడవలయును? కొనిపొండు.

లవు — ఏలఁ జూపవలయును? మీప్రభుత్వము మాయెడ సాగదు వాల్మీకి
మునీంద్రు నాశ్రయింపుఁడు లేదా యుద్ధమున నోడుఁడు మాతల్లి మిమ్ముల
ను విడిపించును.

లక్ష్మ — (రోషముఁ దెచ్చుకొని) డింభకులారా! మాప్రతాపము నెఱుఁగక మా
ట్లాడుచున్నారు గుఱ్ఱమును వదలెదరా? యుద్ధమొనర్తురా?

లవు — హనుమంతునిచే బ్రదికింపఁబడిన నీవు నొక వీరునివలెఁ బల్కుచున్నావు
నీతో యుద్ధమొనరింపనక్కఱలేదు.

మ. కపిరక్షింపక యున్న నీబలము లో ♦ కంబుల్ సుమిత్రాత్మజా!
యపుడే నిండు సుధీరవర్తనుఁడవా ♦ ర్యారాధనంబందుఁ గీ
ర్తిపదంబున్ గనినాఁడ వద్భుతమయెన్ ♦ దివ్యప్రభావోన్నతిన్
రిపులంజంపెడి మమ్మెదుర్పనగునే నీ ♦ కగ్రజోపాసకా!

శతయోజన విస్తీర్ణముగల సముద్రమును దాఁటుటకు భయపడిన యంగదుఁడు వీరుఁ
డా? (అంగదునితో) ఓయీ!

చం. జనకునిఁ జంపినట్టి రఘు ♦ జాతుని సేవయె ముఖ్యమందుఁ బా
వనతర ధైర్యమేది బల ♦ పౌరుషముల్ విడనాడి యాపితృ
వ్యుని దరిఁజేరివాని పను ♦ పున్ దలమోచి మహాబ్ధిదాఁటలే
క నగముపైనఁ జాఁదలఁచు ♦ కష్టుఁడవంగద! యుద్ధమోర్తువే?

మహాభక్తిమంతుఁడగు హనుమంతుఁడే వీరుఁడు చేసిన వాతనితోనే యుద్ధముఁ జేయవ
లయును నామమాత్ర వీరులు మీరలు అతఁడు క్రియామాత్ర వీరుఁడు.

ఉ. చేసిన నాంజనేయునిఁ బ్ర ♦ సిద్ధచరిత్రునిఁ దాఁకి యుద్ధమున్
వాసిచెలంగఁ జేయవలెఁ ♦ బౌరుషహీనుల మిమ్ముఁ గొట్టినన్
భాసురకీర్తి శోభితులు ♦ భవ్యులు మద్గురునర్యులెంతయో
యాసువహింత్రు మాయెడల ♦ నిప్పుడె పొందు గృహంబుఁ జేరఁగన్.

లక్ష్మ — (రోషముతో) ఓయీ! బాలకా! నీజల్పాకత్వమును విడిచి యస్త్రనైపు
ణ్యమును జూపుము.

లవు — నీవు మూర్ఖుఁడవా? లక్ష్మణా! అట్లయిన నిదియే జాగరూకుఁడవై యుండు
ము విశ్వామిత్రుఁడు నీకిచ్చిన యస్త్రములకు గర్వింపకుము వాల్మీకి మహాము

నందప్రసాదలబ్ధంబగు నాదిశక్త్యస్త్రంబును బ్రయోగించుచున్నాఁడను. శక్తియున్న నిలువుము (ప్రయోగించును.)

లక్ష్మ—ఓయీ! యిదియేకదా నీబింకము? (బ్రహ్మాస్త్రమును సంధించును.)

(తెరలో) లక్ష్మణా! ప్రయోగింపవలదు బ్రహ్మాస్త్రమున కది నిలువదు నీయస్త్రమును వ్యర్థమగును మేఘనాథునిఁ జంపునెడ నీవు కావించిన ప్రతిజ్ఞ నే తలఁచుకొని యస్త్రమునకు నమస్కరింపుము అయ్యది నిన్ను మూర్ఛితునిఁ జేయును త్వరపడకుము.

లక్ష్మ—(చేతులు దోయిలించి) ఓయాదిశక్తీ! నాపలుకులు వినుము. "దశరథరాజ నందనుఁడగు శ్రీరాముఁడు నారాయణుఁడేని సీత మహాపతివ్రతయేని నేను వారి నకలంకభక్తి సేవింతునేని నీవలన నాకుఁ బ్రాణాపాయము లేకుండును గాక; (అస్త్రము తగులఁగా మూర్ఛిల్లును.)

అంగ—(తొందరతో లేచి ముష్టిని గ్రహించి) ఓబాలకులారా! యీపిడికిటిపోటు నుజవిచూతురా? మహారాక్షసులు పెక్కు మహాతులయిరి.

కుశు—ఇదే యైంద్రాస్త్రము (ప్రయోగింపఁగా నాతఁడు మూర్ఛిల్లును.)

హను—(తనలో) వీరిద్దఱును మూర్ఛిల్లినారు మేఘనాథునిఁ జంపిన ధనుర్ధరుఁడు లక్ష్మణుఁ డీబాలురయెదుట నిలువలేకపోయెనే? దైవవిధానము (ప్రకటముగా) బాలకులారా! నాతో యుద్ధ మొనరింపుఁడు.

లవు—(కుశునితో జనాంతికముగ) అన్నయ్యా! యీతఁడు శ్రీరామభక్తుఁడు ఈతని నే యస్త్రమును బంధింపఁజాలదు శ్రీరామధ్యాన పరాసక్తుఁ డౌట నెద్దియేని వెఱవుఁజూపి మఱలింతమా?

కుశు—అక్కఱలేదు వీనికి వరములిచ్చిన వారలెంతవారో చూతము ఈతనిపయి నారాయణాస్త్రమును బ్రయోగింతము.

(తెరలో) బాలకులారా! వలదు ఈతఁడవధ్యుఁడు.

లవు—కానిమ్ము (నారాయణాస్త్రమును సంధించి హనుమంతునితో) మహాత్మా! ఆంజనేయా! సీతారాములయెడలఁ గలభక్తియే నిన్ను బ్రదికించును గాక! ఈయస్త్రమును బ్రయోగించుచున్నాఁడను నీవు వాస్తవముగా సీతారామభక్తుఁడగు హనుమంతుఁడవనయేని మూర్ఛిల్లెదవు లేనిచో మరణింతువు. ఇది నారాయణాస్త్రము (ప్రయోగించును.)

హను—(తనలో) వీండ్రు తప్పక సీతారాముల బిడ్డలు పూర్వమే బ్రహ్మనాతోఁ జెప్పియున్నాఁడు మొదటి పర్యాయ మింద్రజిత్తుని బ్రహ్మాస్త్రముచేఁ బడి

తిని ఇపుడీనారాయణాస్త్రముచేఁ బడవలసివచ్చినది కాని నిన్ను మాతల్లి బ్రిదిక్క యేయున్నది అన్నియు బయటఁబడును (అస్త్రమునఁ జూచి) ఓనారాయణాస్త్రమా ! నన్ను బాధింపకుము నేను సీతారామభక్తుఁడను సుదర్శనతేజస్సంపన్నుఁడను నిన్ను మన్నించి వీరలకు వశ్యుఁడనై యుందును, తొంటిబ్రహ్మాస్త్రమువలెనే నీవును నన్ను గ్రహింపుము. (బాణముతగులును.)

లవు—(జనాంతికముగఁ గుశునితో) అన్నా ! యీయస్త్ర మీతనియెడల విఫలమయినట్లున్నది ఈతఁడు పడిపోలేదు.

కుశు—ఈతని వాక్యములువింటివే ? ఈతఁడు మనకు వశ్యుఁడే వీనిఁద్రిప్పి దీసికొనిపోవుదము రమ్ము (లక్ష్మణుని సమీపించి మూఁపున నెత్తుకొనును.)

హను—(తనలో) ఔరా ! యేమాశ్చర్యము ఈబాలురు మానవులా ( రావణుఁడు కదల్పఁజాలని లక్ష్మణుని దృణమువలె నెత్తుకొనినారు ఈచరిత్రమును సాంతముగాఁ జూడవలయును వీరలు తప్పక సీతాపుత్రులే యగుదురు.

లవు—ఆంజనేయా ! యీయంగదుని మూఁపునఁ దాల్చికొనిరమ్ము.

హను—(అంగదు నెత్తుకొని) లవకుమారా ! ఎటకుఁ బోవలయును ?

లవు—మాజననియొద్దకు.

హను—ఆమెపేరు ?

లవు—'సీతా' యని పిల్తురు వాల్మీకి మాతాత,

హను—(ఆశతో) మీతండ్రిపేరు ?

లవు—తెలియదు మాతల్లి నడుగఁదాత నడుగుమనును ఆయన నడుగఁ గొంతదినములలో వచ్చును చూపెదననునే కాని యెవ్వరైనదియుఁ జెప్పరు. ఇంతకుమించి మాకేమియుఁ దెలియదు మాతాతకుఁ దెలియును.

హను—(తొందరతో) మీతల్లినిఁ జూచి నమస్కరింపవలయును వేగముగ రమ్ము. (తనలో) వీరలు సీతాపుత్రులని రూఢియైనను జివరివఱకును దెలుపను దానవీరు రాముని నెదుర్కొందురు అప్పుడు వీరల పరాక్రమము తెలియును.

లవు—ఆంజనేయా ! రమ్ము పోవుదము (దారితీయఁగా నందఱును నిష్క్రమింతురు)

(తెర మాఱఁగా గౌతముఁడును వాల్మీకియుఁ గాన్పింతురు.)

వాల్మీ—గౌతమా ! చూచితివా ? సీతాపుత్రులశౌర్యము హనుమంతుని లక్ష్మణాంగదులను జయించినారు త్రిలోకములేకమయి వచ్చినను వీరలను గెలువఁజాలరు సర్వాస్త్రములును వీరల కవగతములయియున్నవి.

గౌత—ఆశ్చర్యముగనే యున్నది ఇంద్రజిత్తును గెల్చిన లక్ష్మణుని లక్ష్మణుని బ్రది
కించిన హనుమంతుని సకలవానర యువరాజును వాలిపుత్రుడునగు నంగదు
ని గెల్చుట సామాన్యము కాదు ఈసంగతి దెలిసిన శ్రీరాముడెంత విచారిం
చునో? యజ్ఞము చెడినదని యెంత పరితపించునో? భార్యా వియోగమునకే
మిక్కుటముగ కుందుచున్నవాడు దుర్భరమగు నీపరాజయమును విన్నవెట్లు
జీవింపగలడో? ఏతమ్ములు ముల్లోకములను బ్రత్యేకముగ గెలువగలరని
నమ్మియుండెనో యావారలు భరతలక్ష్మణ శత్రుఘ్నులును పరాజయ మొందిరని హనుమదాదులు ఏబాలకుల జయమిచ్చిరని వినినవెట్లు బ్రతుకనే
ర్చును? గురువర్యా! దివ్యదృష్టి నవలోకించి తెల్పుడు.

వాల్మీ—(ధ్యానము నటించి) గౌతమా! వారు లింతకు బూర్వమే యుద్ధవార్తల
ను శ్రీరామునకు దెల్పిరి రాముడు తమ్ములగల సైన్యములతోడను వసిష్ఠాదు
లతోడను బుష్పకారూఢుడై వచ్చుచున్నాడు (కండ్లు తెఱచిచూచి) అదే!
విమానము అప్పుడే సమీపించినది అదేచూడుము శ్రీరాముడును వసిష్ఠుడు
నా సుమంత్రుడును విమానము దిగి వచ్చుచున్నారు వారల నెదుర్కొంద
ము రమ్ము.

గౌత—(చూచి) మునీంద్రా! అప్పుడే లవకుశులు వారలను గలిసికొనినారు వార
లేదియో సంభాషించుకొనుచున్నారు మనమటకే పోవుదము.

వాల్మీ—మంచిది వారలిటు వచ్చుచున్నారు మనము మామూలు మిట్టకే పోవుదము
అటునుండి యుద్ధరంగమును జూతము. (నిష్క్రమింతురు)
(తెర మాఱగా వసిష్ఠమహామునియు శ్రీరాముడును సుమంత్రుడును
బ్రవేశింతురు.)

లవకుశులు—మునీంద్రా! నమస్కారము (నమస్కరించి) వసిష్ఠమహామునీంద్రులు
తమరేనా?

వసిష్ఠుడు—బాలకులారా! విజయమస్తు.

లవు—తమ దర్శనంబున బవిత్రులమయితిమి మేము వాల్మీకి మునీంద్రుల శిష్యుల
ము తమ ప్రభావమును శ్రీమద్రామాయణమును జదివితిమి (రాముని జూచి)
సాక్షాన్నారాయణుడగు శ్రీరామచంద్రునకు నమస్కారము (నమస్క
రింతురు.)

శ్రీరాముఁడు--నాయనలార! జయము గాంతురుగాక దీర్ఘాయువును బొందెదరు గాక; (తనలో) ఈబాలురను జూచినది మొదలుగ నాలింగనముఁ జేసికొని ముద్దాడవలయునని బుద్ధి పొడముచున్నది. మాకేమయిన సంబంధముండి యుండునా! నాబిడ్డలు కారుగదా; నాకంత యదృష్టము కూడునా? (కుడిభుజ మదరుటఁజూచి) ఏమో మంచి శకునములగుచున్నవి (ప్రకటముగా) బిడ్డలార! యిటురండు నాయొద్దఁ గూరుచుండుఁడు నాయజ్ఞాశ్వమును బంధించినదెవరు?

లవు--మేమే లక్ష్మణాదులను గూడ బంధించి మీకు విచారమును గూర్చితిమి అశ్వఫాలమున మీరుంచిన పట్టికయట్లు చేయించినది క్షమింపుఁడు శ్రీమద్రామాయణ కథానాయకులగు తమరు మా యాశ్రమమునకు వచ్చుటచే నఖిలఋషుల యితిరి మిమ్ములను సత్కరింపవలయును.

శ్రీరా--నాయనలారా! ఒకపరి యిటురండు పరిష్వంగ సుఖమునిందు మిమ్ములను జూచిన నాకానందమగుచున్నది.

కుశు--తమ్ముఁడా! (తాను సమీపించి) దరిగర ముఖ్య రామాయణ కథానాయకుని సామాన్యునిగ నెంచరాదు (దగ్గఱకుఁ బోదుము.)

శ్రీరా--(తొడలపయిఁ గూర్చుండఁ బెట్టుకొని లవుని ముఖమునఁజూచి అంతలో దన లో) ఏమీ! సీతాముఖచిహ్నలగుపడుచున్నవి (ప్రకటముగా) నాయనలార! మీతలిదండ్రులెవరు? నాతోడ వచ్చెదరా? మీకు నా రాజ్యమిచ్చెదను మిమ్ములను బుత్రులనుగాఁ బెంచుకొనెదను.

ఉ. వీరవరేణ్యులార! కడు ♦ వేడుకయయ్యెను మిమ్ముఁ గాంచినఁ
ధారుణిఁగీర్తిగాంచు తలి ♦ దండ్రుల పేళ్ళు వినం గుతూహలం
బైరతిఁ గూర్చిఁ జెప్పుఁడు మ ♦ హాత్ములు వారలు రండయోధ్యకుఁ
గారవమొప్ప రాజ్య మొసఁ ♦ గందలపోసితి స్వీకరింపుఁడీ.

కుశు--ఆర్యా! మీ రాజ్యము మాకక్కఱలేదు తక్కిన సంగతులన్నియు వాల్మీకి మునీంద్రుల నడుగుఁడు.

కం. మాతలిదండ్రుల నెఱిఁగిన
సీతాపతి! కార్యమేమి! ♦ చెపుమా నీకుఁ
మా తాత ప్రచేతస్సుతుఁ
డాతతకీర్తి నడుగుము మ ♦ హాసురనేతా!

ఉ. శ్రీరఘువంశవారినిధి ♦ శీతకరుండవు నీవు రాజ్యమీఁ
గోరెద నన్నఁ దృప్తిపడి ♦ గుఱ్ఱము నిత్తుమె? మాకు రాజ్యమే

లా? రమణీయ వైభవము • లన్నియు వీడి వనాంతరంబులన్
జేరిన మొక్కవాఁడయిన • జిత్రము కోరునె? పౌరవాసమున్.

పతివ్రతామణిని వృథాగా విడిచిన దుర్మార్గుఁడు పరులకోడుట నిశ్చయముకదా; ఆర్యా! సాకేతపురనివాసులగు తమరు మహాపతివ్రతయగు సీత నెట్లు విడువఁ గలిగితిరి?

శ్రీరా—నాయనా! ఆమాటఁ దలపెట్టినను మనస్సు దహించుకొని పోవుచున్నది నాకర్మవశమున నట్లు చేసితిని ఏక్షణమున నాదయితను విడిచితినో యదియే నాజీవితాంతమని యెఱుఁగుఁడు ఏసుఖమును లేక జీవచ్ఛవమువలె నున్నాఁడను నాయైశ్వర్యమును సుఖమును వైదేహితోనే పోయినవి.

లవు—అయ్యా! భార్యదగ్గఱ లేనిదే యజ్ఞము నెట్లు చేయుచున్నారు? కళత్రాంతర స్వీకారమును గావించితిరా?

శ్రీరా—(విచారముతో) ఈజన్మమున కట్టిదిలేదు సువర్ణముతో సీతాప్రతికృతిని గావించి యీయధ్వరసంకల్పమును గావించితిని మీపేర్లేమి?

లవు—నాపేరు లవుఁడు (కుశునిం జూపి) ఆతఁడు మాయన్న కుశుఁడు మేము కవలము

శ్రీరా—(తనలో) అన్నియు సరిపోయినవి వాల్మీకి మునీంద్రునిఁ గలిసికొనవలయును (ప్రకటముగా) నాయనలారా! మాగుఱ్ఱమును విడిచిపెట్టుఁడు మీతో యుద్ధముఁ జేయఁ జేతులు రాకున్నవి.

లవు—చేతఁగానివారల యూహలవి అడిగితిరేని గుఱ్ఱమును విడిచిపెట్టెదము కాని, మీరు మాకోడితిమనవలయును.

వసి—(దివ్యదృష్టిం జూచి తనలో) ఆనందమానందము సీతాపుత్రులు కావుననే రా? మనకిట్టి ప్రేమము గలిగినది ఎవ్వనికిఁ సకలధరామండల సార్వభౌముఁడగు శ్రీరాము నంకతలమునఁ గూర్చుండ నగును? ఆత్మసంబంధ మూరకుండునా? ఇయ్యది సుఖపర్యవసాయి కావలెను (ప్రకటముగా) వత్సలారా! ఈరాముఁడు సాకేతపుర నగరవాసుఁడగు నారాయణదేవుఁడు ఈతనిని మీరు గెల్వఁజాలరు ఈయజ్ఞాశ్వమును విడువుఁడు ఈతనితో వచ్చిన మీకు రాజ్యమిచ్చును.

ఉ. కందువలార! యీప్రభుఁడు • క్ష్మాతనయాపతి దేవరక్షకుం
డందునఁ గానె చంపెనిబు • ధారిని రావణునస్త్రవేదియై
మందుహయంబువీడి శర • ణావను సీతనిఁ జేరి పుత్త్రులై
యందముగా మహీవలయ • మంతయుఁ జైకొని సౌఖ్యమందుఁడీ.

కుశ—మునీంద్రా! మాకు రాజ్యముతోఁ బనియేమి? ఈతఁడు విష్ణుదేవుఁడంటిరి అది మఱియు సంతోషము ఈతనిం గెల్చితిమా గొప్పగఁ గీర్తి లభించును ఓడితిమా మాకగౌరవము లేదు కాన యుద్ధమే యవశ్యకర్తవ్యము.

సుమంత్రుఁడు—బాలకులార! ఈ శ్రీరామచంద్రుఁడు దివ్యాస్త్రవిదుఁడు విశ్వామిత్రునివలన సమస్తాస్త్రములను బొందినవాఁడు ఈతనితోఁ బోరు మీకు సాధ్యముకాదు లక్ష్మణాదులను గెల్చుట లెక్కకాదు.

లవు—అది వాస్తవమే అయినను మాకుఁగల దివ్యాస్త్రములను జూపెదము చూచి యందేయస్త్రము మీకు లేదో తెలిసికొనుఁడు (ఆకసమువంకఁ జూచి) ఓయస్త్రదేవతలారా! మీరలందఱు నొకపర్యాయము దర్శనమిచ్చి యీ శ్రీరామచంద్రుని భ్రాంతి మాన్పుఁడు.

(తెరలో గొప్పకాంతి కాన్పింపఁగా శ్రీరామాదులు పరిశీలించి చూతురు.)

వసి—శ్రీరామా! ఈయస్త్రములన్నియు నీకుఁ గలవుగదా! మీలో నెవ్వరధికులు?

శ్రీరా—(జనాంతికమున వసిష్ఠునితో) మునీంద్రా! ఒక్క యాదిశక్తి తక్కఁ దక్కిన వన్నియు నాకును గలవు ఏనాఁడు సీతను విడిచితినో యానాఁడే యాదిశక్తి నన్ను విడిచిపోయినది ఈబాలురది యెఱిఁగిరేని వీరికే గెల్పుకల్గును లేనిచో సమానులమగుదుము.

లవు—(వసిష్ఠునితో) మునీంద్రా! మా తాతగారు దివ్యప్రభావముగు నాదిశక్త్యస్త్రమును బ్రసాదించుచు నిది మీకుఁ దక్క యెవ్వరియొద్దను లేదని చెప్పినారు ఆయన మఱియుఁ గొన్ని రహస్యములను జెప్పెను.

చం. మునివర! దివ్యవర్తనుఁడె • పౌరుషయుక్తుఁడు నీలివీడుటల్
ఘనమగు నాదిశక్తి కెడ • కావలనక్క మము గెల్వనేరఁడే
పనువునవైన, శిష్యులము • ప్రాభవమేల మహాత్మ! మాకు నీ
జననుత విక్రమున్ గెలువఁ • జాలినఁ జాలదె? కీర్తిధామశిక్

వసి—బాలులారా! మీరు దివ్యాస్త్రవిదులే వ్యర్థముగ మీయస్త్రములను బ్రయోగించుకొనకుఁడు వాగ్రూపకంబున నీయస్త్రమును బ్రయోగింతుమనుచు సంభాషించుకొనుఁడు అందెవ్వారు ప్రత్యస్త్రమెఱుఁగరో వారోడినట్లు నిర్ధారింపఁబడును గెల్చినవారలవసరమైనచో నాయస్త్రమును జూపవలయును.

శ్రీరా—నాయనలారా! యుద్ధమును మానరా?

లవు—మేమేమి? చేయుదుము (అంకతలమునుండి యిద్దఱును దిగుదురు) ఇది దైవవిధానము ముందుగ మేమెఱిఁగి దీనిని బట్టలేదు పట్టినపిమ్మటఁ బట్టి కనుజా

చితిమి విడిచినఁ బౌరుషహీనతయని యెంచితిమి అనంతర మిట్లైనది కానరణమే యవశ్యకర్తవ్యము.

శ్రీరా—ఏయస్త్రములను బ్రయోగింతురు.

లవు—అయ్యా! నీవును దివ్యాస్త్ర సంపన్నుఁడవు స్వల్పులగు సామాన్యాస్త్రములతోఁ బనిలేదు! పాశుపతమును బ్రయోగింతుము.

శ్రీరా—అయ్యది నాయొద్దను గూడ నున్నది.

లవు—అయిన మహారౌద్రము.

శ్రీరా—అదియుంగలదు.

లవు—అట్లయిన బ్రహ్మాస్త్రము

శ్రీరా—దానిచేఁగాదె రక్షోనాయకులఁ జంపితిని.

లవు—వైష్ణవాస్త్రము.

శ్రీరా—అదియే చూడుఁడు నాకునుగలదు (అ దేవతను జూపును)

లవు—(చూచి) నారాయణాస్త్రమును బ్రయోగింతుము.

శ్రీరా—అదియుంగలదు.

కుశు—విష్ణుచక్రమును గాని కౌమోదకిని గాని మహా శూలమును గాని ప్రయోగింతుము.

శ్రీరా—అవియన్నియు నాకునుగలవు.

లవు—అట్లయిన నీకె నాలస్యమేల? ఆదిశక్తిని బ్రయోగింతుము.

శ్రీరా—(దిగులువడి ఆత్మగతమున) అయ్యో! నాకపజయము సిద్ధము కాఁబోలును (ప్రకటముగా ధైర్యమును నటించి) ఏది? ప్రయోగింపుఁడు.

వసి—(ఆత్మగతము) అయ్యో! శ్రీరాముఁ డోడిపోవును గాఁబోలును వాల్మీకియు సీతాదేవియు బ్రహ్మదేవుఁడును సమయమునకు వత్తురు గాక;

లవు—ప్రయోగింపుమాఁడువా!

శ్రీరా—(లేని బింకమును దెచ్చుకొని) ఆలస్యమేల! చూపుఁడు మీశక్తి నంతయుఁ జూచెద.

లవు—(ఆకసమువంకఁ జూచి) ఓలోకత్రయవాసులార! నాప్రతిజ్ఞవినుఁడు "మీాజనయిత్రి సీత మహాపతివ్రతయేని మమ్ముఁ బెంచిన వాల్మీకి మహాముని ద్రిఁ దేని మాకాతఁడొసఁగిన విద్యలు యథార్థంబులైన వేని నాయీయాదిశక్తిచే శ్రీరాముఁడు:—

(తెరలో) మూర్ఛిల్లును గాక;

కుశు—ఎవరీ పలికినది? మాదేవతలా? సరియే

లవుడు—(ప్రయోగింపఁగా నప్పకాంతియు ధ్వనియుఁ దోఁచును.)

శ్రీరా—(చూచి) హా సీతా! సీతా! (అనుచు మూర్ఛిల్లును)

సీత—(ప్రవేశించి) ఎవ్వరో నన్నుఁ దలఁచుకొనుచున్నారు (రామునిఁజూచి) హా! ఆర్యపుత్రా! చివరకు నాకీదశయందుఁ గాన్పించితివా? (లవునిఁజూచి) అయ్యో! నాయనా! మీతండ్రినిఁ బడఁగొట్టితివా? ఇఁక నాకేది దిక్కు! (రామునియొద్దఁ జతికిలఁబడును.)

లవు—(ఆత్రముతో) అమ్మా! మాతండ్రియా? అయ్యో! ఒకప్పుడును జెప్పవైతివే? ఎఱిఁగిన నిట్లు చేతునా?

కుశు—అమ్మా! చెప్పక యెంతచిక్కుఁ దెచ్చిపెట్టితివి? అయినను బ్రమాదములేదు తమ్ముఁడుచేయు ప్రతిజ్ఞాకాలమందు శ్రీరాముఁడు మూర్ఛిల్లునుగాక యని యశరీరవచనము వినఁబడినది (విచారముతో) అయ్యో! యెంతపనిఁజేసితిమి? తండ్రితో యుద్ధముఁ జేసితిమి పిన్నతండ్రులను మూర్ఛఁగొట్టితిమి మహాభ్రాతలగు హనుమజ్జాంబవంతులను బద్ధులను జేసితిమి అమ్మా! నీవు చెప్పకపోవుటవలనఁగదా యిట్టి విపరీతములు జరుగుట

వాల్మీ—(ప్రవేశించును.)

సీత—(వాల్మీకినిఁజూచి) తండ్రీ! నాగతి యిట్లాయెనుగదా ఆర్యపుత్రుని దశయిందా నాకుఁ జూపుట? నేనిఁక బ్రదుకఁజాలను హా! ఆర్యపుత్రా! (శ్రీరామునిఁ గౌఁగిలించుకొనును.)

శ్రీరా—(లేచి) హా సీతా! సీతా! నీబిడ్డలా? యీ బాలురు అయ్యో! తెలియకపోయితిని.

సీత—(లేచి) ఆర్యపుత్రా! నమస్కారము (పాదములపయిఁబడును.)

శ్రీరా—(లేవఁదీసి) సాధ్వీ! లెమ్ము నిన్నిన్ని శ్రమలుపెట్టిన నన్ను మన్నింపుము ఈబిడ్డలసంగతిఁ జెప్పుము.

సీత—మహాత్ముఁడగు వాల్మీకి చెప్పును (వసిష్ఠునిఁజూచి) మునీంద్రా నమస్కారము (నమస్కరించును.)

వసి—అమ్మా! సీతా! యీబాలురు నీతనయులని యిదివఱకే యెఱుఁగుదును నీపుత్రులు తండ్రినిఁ గూడ గెల్వసమర్థులని తెల్పుటకే యింతవఱకు జెప్పక యూరకుంటిని దుర్వాసుఁడు విధిప్రేరితుఁడై వచ్చి మిమ్ములను గలుపఁగోరి

శ్రీరా—హా సీతా ! సీతా ! (భూమిలోనికిఁ బోఁబోఁగా భూమి కలిసి పోవును)

లవకుశులు—అమ్మా ! అమ్మా ! మమ్ము విడిచిపోయితి వే ? మమ్మింకఁ గనిపెట్టువా రెవరు ? హా వసుంధరా ! మాతల్లితో మమ్ముఁ గూడఁ గొనిపొమ్ము.

వసి—శ్రీరామా ! విచారింపకుము సీత మహాపతివ్రత ఆమెను సామాన్యకాంతగాఁ జూచితివి ఆమె తన పాతివ్రత్య మహిమను జూపినది.

లవు—అయ్యో ! దైవమా ? మేమెంత దురదృష్టవంతులమో కదా ; తల్లియో తండ్రియో మాకుఁ గలిగినను [illegible] భాగ్యము లేక పోయినది.

శ్రీరా—నాయనలారా ! మీరైనను మీతల్లిని బ్రతికించుకొనుఁడు.

కుశ—తండ్రీ ! యిట్లు జరుగునని యెవ్వరనుకొనిరి ! [illegible] బంధముక్తులను జేసెదము గాక ;

లవు—(అస్త్రదేవతల నుద్దేశించి) ఓయస్త్రదేవతలారా ! మీయనుగ్రహమున గెల్చితిమి వారలను యథాప్రకారముగ విడిచిపెట్టుఁడు.

వాల్మీ-శ్రీరామా ! విచారించినఁ బ్రయోజనము లేదు "పుత్రాదిచ్ఛేత్పరాజయ "మ్మను నది నీయెడల సార్థకమైనది త్రిలోకైక విజేతులగు పుత్రులు లభించిరి వీరిని దీసికొని సాకేతపురి కరుగుము సుఖముగ రాజ్యమేలుకొనుము.

శ్రీరా—నాకు రాజ్యముతో [illegible] జీవితముతో [illegible] జీవితేశ్వరి లేని జీవనమేల ? పుత్రులు లభించిరను సంతోషమావంతయు లేదు.

మ. అకటా ! రాజ్యము సంపదల్ సుఖములుం ♦ బ్రాణంబులున్నా కులే
వకటా ! యిన్నియు సీతతోఁ జనియె (సీత నుద్దేశించి) నా ♦ యాత్మేశ్వరీ మైథిలీ !
యకలంకంబె భవచ్చరిత్రము మదీ ♦ యాపాదరంబుల్ క్షమిం
చి కళావాసిని ! రమ్మనని లుపుమా ♦ శ్రీభామినీరత్నమా !

హా ప్రాణేశ్వరీ ! జనకరాజనందిని ! హా సీతా ! (మూర్ఛిల్లును.)

(లక్ష్మణభరత శత్రుఘ్నులును విజయసేనాంగదహనుమంతులును బ్రవేశింతురు. వసిష్ఠునకును వాల్మీకిని నమస్కరింతురు.)

లక్ష్మ—(కుశలవులతో) నాయనలారా ! మీతండ్రి శ్రీరాముఁడు. మొదట నాకు మీముఖములను జూడఁగానే సందేహమైనది.

భరతశత్రుఘ్నులు—(లవకుశులు నమస్కరింపఁగా నాలింగనముఁ జేసికొందురు.)

హను—లవకుశులారా ! మీప్రతాపములకు మేలయ్యో ! తండ్రిని మేల్కొలుపుఁడు.

జాంబ—ఏమియు పాయము ? సీతయున్నచో నాతని కీస్థితి రాదు కదా ;

సుగ్రీ—(ప్రవేశించి) ఆంజనేయా! సీతభూప్రవేశ మొనర్చినదని దేవతలు చెప్పుకొనుచుండఁగా విని వచ్చితిని శ్రీరాముఁడు మూర్ఛిల్లెనా? అయ్యో! (రాము నిపాదములకు నమస్కరించును.)

లవు—పూజ్యులారా! మిమ్ము నెఱుఁగక మీశరీరముల నొప్పించితిమి మమ్ములను మన్నింపుఁడు.

సుగ్రీ—(లవకుశులను జూపి హనుమంతునితో) ఈబాలకు లెవ్వరు?

హను—సీతాపుత్రులు మమ్మందఱను శ్రీరామునిఁ గూడ గెల్చినవారు అత్యద్భుత ప్రతిభాశాలురు దివ్యాస్త్రకోవిదులు.

జాంబ—ఆంజనేయా! లంకలో నున్న మనతల్లిని గాంచి వచ్చితివి ఇప్పుడు చూచి రాలేవా?

హను—నిమిషములోఁ దీసికొనివచ్చెదను మునీంద్రులారా! అనుజ్ఞ నిత్తురా?

లక్ష్మ—(లవునితో) కుమారా! అమ్మను దీసికొని రాఁగలవా?

లవు—ఆ! యరనిమేషమున (ధనువునఁ బాశుపతమును సంధించి భూమినుద్దేశించి) ఓవసుంధరా! మాతల్లి నొప్పగింతువా లేదా? లేనిచో నిన్నిదే నాశనముఁ జేయుచున్నాను ఇదియే పాశుపతాస్త్రము.

తే. గీ. భూమినో! మాజనకుఁడిదె ♦ మూర్ఛితునిఁగ
మాజనని గర్భమున దాఁచి ♦ మముఁ దల్లి
లేనివారినిఁ జేసితి ♦ వేని నిన్ను
హతముఁజేసి కైకొందు మా ♦ యంబ నిపుడె.

(అంతరిక్షమున) వలదు కుమారా! ఉడుగుముడుగుము.

బ్రహ్మదేవుఁడు—(ప్రత్యక్షుఁడగును.)

అందఱును (నమస్కరింతురు.)

బ్రహ్మ—లవకుశులారా! మీకోర్కెయేమి? నిష్కారణముగా వసుంధర నేలబాధింతురు.

లవు—మా బాల్యమున నే మాతల్లిని దీసికొనిపోవచ్చునా?

బ్రహ్మ—మీతల్లియొక్క ప్రతిన నెఱవేర్చినది (శ్రీరామునిఁజూచి కమండలువునందలి జలముచల్లి) రామా లెమ్ము.

శ్రీరా—(లేచి బ్రహ్మనుజూచి నమస్కరించును.)

సుగ్రీ—(రామునకు నమస్కరించును.)

శ్రీరా—సుగ్రీవా! (సైన్యముతో) నాగతిఁ జూచితివా? ఇప్పుడు మీరు సహాయముఁ జేయఁజాలరుకదా: (హనుమంతునితో) ఆంజనేయా! మీజనయిత్రిని దీసికొని రా నేరవా?

హను—ప్రభూ! యిదేపోయి యేలోకమున నున్నను దీసికొని వచ్చెద సమస్తభువనములును భస్మము చేసివచ్చెద.

బ్రహ్మ—ఆంజనేయా! తొందరపడకుము జగన్మాతయైన సీతను వసుంధర తొడపయిఁ గూర్చుండఁ బెట్టుకొని ప్రత్యక్షమగుచున్నది.

(సీతను దొడలపైఁ గూర్చుండఁ బెట్టుకొని సీత ప్రత్యక్షమగును.)

లవకుశులు—(సమీపించి) అమ్మా! అమ్మా! మమ్మువిడిచిపోయితివా?

శ్రీరా—జానకీ! నన్ను విడిచిపోయితివా! ఇదే యిప్పుడు మఱలఁ బ్రమాణముఁ జేసెద నిన్ను నిమేషమేని విడిచియుండను రమ్ము నన్ననుగ్రహింపుము (లేచి సమీపించును.)

సీత—(లేచి) ఆర్యపుత్రా! పలపాంసని నగు నన్ను సమీపింపకుఁడు నాకు జీవితముపయి నభిలాషలేదు.

శ్రీరా—అట్టయిన నిరుపుర మొకపర్యాయము దేహమును బాయుదుము.

లవ—(సీతతో) అమ్మా! (రామునితో) నాయనా! మమ్ము విడిచిపోయెదరా?

సీత—(లవుని గౌఁగిలించుకొని ముద్దుకొని) నాయనా! మీతండ్రిగారి నెట్లు మన్నించితివి?

లవ—ఆయన కాన్పింపఁగా నే నమస్కరించితిమి.

సీత—నాయనలారా! అదియే యుచితము మీనాయకమునకుఁ దగినపనిని జేసితిరి

వసుంధర—శ్రీరామా! ఈమె యయోనిజ మహాపతివ్రత ఇదివఱలో ఇప్పుడు నేనిచ్చుచున్నాను ఈమెను బరిగ్రహించి లోపములను మన్నింపుము (సీతచేయిని శ్రీరామునిచేతి యందుంచును పుష్పవృష్టి పరయును)

హను—మాతలిదండ్రులకు నమస్కారముఁ జేయుచున్నాను (నమస్కరించును.

సీత—ఆంజనేయా! నీవు నాకు జ్యేష్ఠపుత్రుఁడవు నీతమ్ములను లవకుశులను బ్రేమతోఁ గాపాడుచుండుము.

శ్రీరా—సీత—(బ్రహ్మాదులకు నమస్కరింతురు)

బ్రహ్మ—శ్రీరామా! నారాయణుఁడవు నీవు సీత మహాలక్ష్మి మీరు నాకుఁ దలిదండ్రులు లీలామానుషవిగ్రహులై యిట్టి కష్టసుఖముల ననుభవించుచున్నారు

వాస్తవమున నేమియు లేవుగదా మీకుమారులు లవకుశులు వంశకర్తలై కీర్తి
గాంచెదరుగాక; ఇంక నేమైనఁ గోరెదవా ?

శ్రీరాముఁడు—దేవా ! లోకవిధాతా ! నీయనుగ్రహమునుమించి యేమియునక్క-
ఱలేదు అయినను బ్రజలకై యీకోర్కె ననుగ్రహింపుము (భరతవాక్యము)

ఉ. దేశము సస్యసంపదలఁ ♦ దేజరిలన్ వలె దేవనాథుఁ డా
దేశమునన్ ధరాతలిని ♦ దివ్యముగా జలదంబు వృష్టిని
ర్దేశతరీతి నీవు తవ ♦ రిష్టచరిత్రులుగాఁ బ్రజాలి భూ
మీశునిఁ బ్రోవుతన్ నృపుఁడు ♦ నెల్లెడవారల నోముచుండుతన్.

బ్రహ్మ—అట్లు యగుంగాక,

వసి--శ్రీరామా ! నిబిడ్డలను భార్యనువాల్మీకి కాపాడినాఁడు అతనియెడఁ గృత
జ్ఞుఁడవై యుండుము.

శ్రీరా--ఆమహాత్ముఁడు నాచరిత్రమును గూడ రచించెనని వినియుంటిని.

వాల్మీ--రామా ! ఆసంగతియంతయుఁ బిమ్మట మాట్లాడుకొందము నీపుత్రులు నీకు
నారామాయణమును విన్పింతురుగాక ! సాంప్రతమయోధ్యకరిగి యువరాజ
పట్టాభిషేకముఁ గావింతము.

శ్రీ--ఆదియే పుష్పకము అందధిరోహింతము (అందఱు నెక్కఁబోయెదరు తెర
వ్రాలును.)

ఇయ్యది శ్రీమదాత్రేయ విరచితంబగు నుత్తరరామచరిత నాటకంబున పుత్రరాముపు
త్ప్రాప్తి కథనంబను నది చతుర్థాంకము.

సంపూర్ణము.



4 వ పారుగు మొదలు ది ఆల్బర్టు పవర్ ప్రింటింగు వర్క్సు యందు
ముద్రింపఁబడియె 1924.

